# కల్లోలం

(నాటకం)

శివరామశాస్త్రి
రాధాకృష్ణ

నవయువ ప్రచురణలు
ఫోన్ నెం. 4816
1641, గౌలిగూడచమన్
హైదరాబాద్ (దక్కన్)

B

నవయుగ ప్రచురణలు 1.



ఈ నాటకం ప్రదర్శించాలంటే రచయితల లిఖితపూర్వక
అనుమతి పొంది తీరాలి.

సహృదయులైన వారినుండి వచ్చే సలహాలను
కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

ఆరుప్రతులు ఒకేసారి కొనువారికి ఒకప్రతి ఉచితం.

వెల ముప్పావలా (కల్దారు)

నవంబరు 1949

రాజకీయాలను వృత్తిగా చేసుకుందామని

ప్రయత్నించి విఫలురై

నాశనమయిపోయిన

మానవకోటికి

అంకితం

# ఈ నాటకంలో

రాముదాసు

గోపీచంద్

వాసు

సీతమ్మ

కమల

గంగాధర్

మహమ్మదల్లీ

వెంకన్న

వీరేకాక బిచ్చగాడు మొదలైనవారు ఉంటారు.



| | | | | | |
|---|---|---|---|---|---|
| ఒకటోరంగం | ... | సమయం | ... | నవంబరు | 1940 |
| రెండోరంగం | ... | సమయం | ... | ఆగస్టు | 1942 |
| మూడోరంగం | ... | సమయం | ... | అక్టోబరు | 1947 |
| నాలుగోరంగం | ... | సమయం | ... | మార్చి | 1949 |



# 1

(ఒకటోరంగం ప్రదర్శించేముందు ఈక్రిందిమాటల్లు చదవాలి)

ప్రపంచాన్ని ఆవరించిన ఫాసిస్టు పెనుభూతాన్ని తుదిముట్టించడానికి సెప్టెంబరు 1939 లో ద్వితీయ ప్రపంచమహాసంగ్రామం మొదలైంది. మిత్రరాజ్యాలు, శత్రురాజ్యాలు మహాఘోరంగా ప్రపంచాన్నంతా యుద్ధంలో ముంచేశాయి. దాంతో ప్రపంచంలో ఒక మహాకల్లోలం ఆరంభమయింది.

ఇకఇండియాలో: ఆనాటి గవర్నర్‌జనరల్ లార్డు లిన్‌లిత్‌గో రాష్ట్రాలలోవున్న కాంగ్రెసు మంత్రివర్గాలను సలహా అడగకుండానే ఇండియా కూడాయుద్ధంచేసే దేశాలలోఒకటని ప్రకటించాడు. దాంతో కాంగ్రెసు తమమంత్రివర్గాలను రాజీనామా ఇవ్వవలసిందిగా ఆదేశించింది. దేశంలో కల్లోలం... కల్లోలం ఆరంభమయింది. కాంగ్రెసు సూత్రధారి, బాపూజీ ఇదే సమయంలో భారతదేశ స్వాతంత్ర్య శంఖారావాన్ని పూరించాడు– కాంగ్రెసు సంస్థ బ్రిటిషువారితో పోరాటాన్నిజరిపి అప్పటికి పది ఏళ్లయింది. దాంతో కాంగ్రెసులోకూడా కొందరు కులాసా పురుషులు జొరబడ్డారు. ఈ జడత్వాన్ని రూపుమాపి, తిరిగి దేశాన్ని ఆవరించుకొన్న అంధకారంలో, సమరమనే ఆశాజ్యోతిని చూపాడు బాపూజీ. దానికి పునాదిగా వ్యక్తిగత సత్యాగ్రహం మొదలైంది. అంతకుమునుపే 1940 అక్టోబరులో జవాహర్‌లాల్ నెహ్రూను బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టుచేసింది. సత్యాగ్రహాలు... వ్యక్తిగత సత్యాగ్రహాలు... దేశాన్ని కల్లోలంలో ముంచేశినయి. ఈ పరిస్థితులలో తెలుగుదేశంలోని ఒక కుటుంబం.

# ఒకటో రంగము.

[తెరఎత్తగా రామదాసు ఇల్లు కనిపిస్తుంది. వాసు పుస్తకం చదువుతుంటాడు. కొంతిసేపటికి కమల ఆడుతూ పాడుతూ ప్రవేశం.]

—♦ పాట ♦—

బోసినోటీ గాంధితాతా
నాల్గు పరకల పిలక గాంధితాతా
కోపంలేని మాతాత గాంధితాతా ॥బోసి॥
నవ్వితే ముత్యాలె గాంధితాతా

(గాంధీ ఫోటోచూస్తూ)

సత్యాగ్రహం చేస్తాను గాంధితాతా
జైలుకెళ్ళమంటావా గాంధితాతా ॥బోసి॥

వాసు:- (కోపంతో) కమలా ఏమిటాగోల, వెధవపాటలూ నువ్వూను.

కమల:- నీకు తెలియదా చిన్నన్నయ్యా, నాన్న యివ్వాళ సత్యాగ్రహం చేస్తున్నాడుగా. గాందీతాతయ్య చెప్పాడుగా అందర్నీ జైలుకెళ్ళమని. గోపీ అన్నయ్యా, నువ్వూచేస్తారా సత్యాగ్రహం.

వాసు:- ఏడ్చావ్. ఆ గాంధీగారు చెప్పడం ఈ దాసుగారు వినడం, సరిపోయింది సత్యాగ్రహంట, సత్యాగ్రహం... ఇదిగో, ఆ పాటలుగనక నాముందు పాడావా దవుడపూడగొడ్తా.

కమల:- (ఏడుస్తూ ఇంట్లోకి వెళ్ళబోతుంటే, ఇంట్లోంచి వెంకన్న, వాకిట్లోంచి గోపీచందు ప్రవేశం).

గోపీ:- కమలా, ఇలారా ఏడుస్తున్నావెందుకమ్మా.

కమల:- (గోపీ, చంకనెక్కుతూ) పెద్దన్నయ్యా, వ రే... వాసన్నయ్యే... నేనే గాంధీ తాతయ్యపాట పాడుతూంటేనూ, కొడతానన్నాడన్నయ్యా.

గోపీ:- గాంధీతాతయ్యపాట పాడితే కొడతానన్నాడా, వాసన్నయ్యకి తాతయ్యంటే మంచి కోపంలే, తాతయ్యేమో ఇంగ్లీషువాళ్ళని వెళ్ళకొడదామంటాడు వాసన్నయేమో వాళ్లకు సాయంచేద్దాం అంటాడు.

కమల:- అన్నయ్యా, వాళ్లకు సాయంఎందుకూ. తాతయ్య వెళ్లిపొమ్మంటుంటే

గోపీ:- ఛా, వాళ్లకు సాయంచేస్తామూ, వాసన్నయ్యొక్కడు అంటేమాత్రం సాయం చేసేదెవరు, అందుకనేగా "మాకు మీ రాజ్యంవద్దు, మీమాటవినం, మా గాంధీతాతయ్య మాటే వింటాం" అంటూ తెల్లవాళ్లతో చెప్పటానికేగా నాన్న యివ్వాళ సత్యాగ్రహం చేస్తున్నాడు—వెంకన్నా, నాన్నేంచేస్తున్నాడో చూడు— ఊరేగింపు అప్పుడే వస్తోంది... సత్యాగ్రహంచేసే టైమవుతోంది.

వెంకన్న:- (చూచి) అయ్యగారొస్తున్నారు బాబూ,

కమల:- నాన్నని పిలుచుకొస్తానుండు (అంటూ లోపలికి వెళ్ళిపోతుంది).

గోపీ:- (వాసుచేతిలో పుస్తకం చూస్తూ). స్టాలిన్ పుస్తకం చదువుతూ కూర్చున్నావా కామేడ్. నీకు మనసెల్లావప్పు తోందిరా... ఒకప్రక్క ప్రజలంతా సత్యాగ్రహాలు ఊరేగింపులు చేస్తూంటే;... నాన్న ఇవాళ సత్యాగ్రహం చేస్తున్నాడనయినా జ్ఞాపకంవుందా. కమలకున్న జ్ఞానం అయినా లేదా కామేడ్ నీకు. స్టాలిన్ పుస్తకం చదవ టానికి టైము ఇప్పుడే దొరికింది కదూ...

వాసు:- (కోపంగా చూస్తూ వుంటాడు. ఇంతలో కమలతో రామదాసు ప్రవేశం)

రామ:- గోపీ వచ్చావా .. ఊరేగింపు ఎంతవరకు వచ్చింది ? నాపనీ అయింది నేను తయారుగా ఉన్నా... వాసూ, (పుస్తకం చదువుతున్నట్లుగా గ్రహించి గోపీతో) గోపీ, అదిగో ఊరేగింపు వచ్చేస్తోంది. సమయమవుతోంది..., ఈ ఇల్లు భారం అంతా నీకప్పచెప్పి పోతున్నా... నాకు తెలుసు నీవు సమరంలో దూకేందుకు సిద్ధంగా వున్నావని. ... దేశంకోసం నేవెళ్తొస్తా... నీవిల్లు చూస్తూవుండు... కమలా, పెద్దన్నయ్యమాట వింటూవుంటావుకదూ...వెం కన్నా - జాగ్రత...

కమల:- నాన్నా, గాంధీతాతయ్య దగ్గరికి పోతున్నావుగా, నేనూ వస్తా తాతయ్య దగ్గరకు మనవూరికి వచ్చినప్పుడే నాన్నా, తాతయ్య దగ్గర కూర్చున్నా కదూ. నేను వస్తా నాన్నా, నితోటె... వాసన్నయ్య ఇంట్లో వుంటెకొడతాడు.

రాము:- నా చిట్టితల్లీ... వద్దమ్మా... పెద్దన్నయ్యా ఉన్నాడుగా... భయం లేదమ్మా నేను మళ్లీ త్వరగా వచ్చేస్తా.

కమల:- పోనీలే.. నన్ను ఊరేగింపులోకి తీసుకెళ్లు నాన్నా గాంధీ తాతయ్యపాట పాడుతా, వందేమాతరం పాటపాడుతా...

గోపీ:- (ఎత్తుకుంటూ) చెల్లాయి... నీవు చిన్నపిల్లవికదూ. ఆగుంపులోకి రాకూడదమ్మా... మన అరుగుమీాదనుంచి అమ్మా, నువ్వూ, వాసన్నయ్యా చూస్తూవుండండేం... నాన్నని పంపించి నేనిప్పుడేవస్తా... ఆ....(ఇంతలో సీతమ్మ మంగళహారతి పళ్లెం తెచ్చి రామదాసు మెళ్లో హారం వేసి కాళ్లు అద్దుకుంటుంది.)

రాము:- (చూచి)పిచ్చిదానా, విచారిస్తున్నావా. సత్యాగ్రహం చేసేందుకు పోతున్న నన్ను సంతోషంతో పంపాలి గాని ఏడుస్తూ పంపుతావా... ఏదీ నవ్వుతూపంపు... ఏదీ (సీతమ్మనవ్వుతుంది) ఆ...గోపీ వున్నాడుగా...కమలుంది. మరి వాసున్నాడు... పరమాత్ముడుదయ చల్లగా వుంటే చాలా తొందరలోనే కలుస్తాం... పోయివస్తా... అదిగో ఊరేగింపు మనవాకిట్లోకివచ్చేస్తోంది అదిగోచూడు (తెరలో నినాదాలు వినిపిస్తాయి) అబ్బ ఎంతజనం... ఏపవ్రాహం ...ఎంతమంది ప్రజలు... (మహాత్ముని ఫొటోనుచూస్తూ) నీవాక్యంలో ప్రజకు ఎంత శ్రద్ధాభక్తులున్నాయి మాలోని జడత్వాన్ని రూపుమాపి మాలో సంచలనం కలిగించావు కదూ... అదిగో (తెరలో నినాదాలు వినిపిస్తాయి. అలా

అంటూ, గోపీ, వెంకన్న వెంటరాగా వెళ్ళిపోతాడు. సీతమ్మ కమల, వాసు చూస్తూవుంటారు.)

వాసు:- (వాళ్ళు వెళ్ళిపోగానే) చూశావా అమ్మా నాన్న ఎన్ని చెప్పినా వినిపించుకోడు కదా... పెద్దన్నయ్య కూడా ఆయనకు తోడయ్యాడు వంతపలికేందుకు... నంది అంటె నంది పంది అంటే పంది... రెండో ప్రపంచయుద్ధం జోరుగా జరుగుతూవుంటే యిప్పుడెందుకు సత్యాగ్రహాలు వీళ్ళకి... ఇంగ్లీషువాళ్ళు పోవడానికిదియేనా సమయం... అందుకనే మా కమ్యూనిస్టుపార్టీ ఈ చాదస్తం పెట్టుకోదల్చుకోలా... ఈ ఆగ్రహాలలో మాకు విశ్వాసమేలేదు.

కమల:- (తెరప్రక్కలో చూస్తూ) అమ్మా గాంధీ తాతయ్య మాటంటే ఎంతమంది వచ్చారే... అదిగో నాన్న మెళ్లో దండలేస్తున్నారేవ్... అబ్బ ఎన్నిదండలే ఎన్నిదండలే నాన్న దండల్లోమునిగిపోయాడేవ్, అన్నయ్యకూడా పోతున్నాడేవ్ అమ్మా నేనుగూడా పోతానే... (అని వినిపించుకోకుండానే తెరలోకి వెళ్ళిపోతుంది.)

సీతమ్మ:- (గమనించకుండా) ఛీ... నీవెళ్లొద్దు.

వాసు.- అరె పోలీసు లారీలొచ్చాయే... అరె... పిచ్చ జనం అట్లా పోలీసుల దగ్గరకు పోతున్నారేం... అరె పోలీసులు తుపాకీలు తీస్తున్నారే నాన్నేడి...అన్నయ్యేడి. కనపడరేం. ... అయ్యయ్యో (తెరలో కలకలం కేకలు) అదుగో నాన్న అదుగో అన్నయ్య. నాన్న జండా పుచ్చుకొని ముందుకు నడుస్తున్నాడు... (తెరలో ధాం, ధాం, అని

శబ్దం) అరె ఏమిటా-పాగ జనమంతా పారిపోతున్నారేం... నాన్నేడి... అన్నయ్యేడి... కనపడటంలేదు... కమలేది? (చుట్టూ చూస్తారు).

సీత:- అయ్యో... కమలేదీ... కమలా...

వాసు:- అమ్మా, ఇంట్లోకి పోయిందేమోచూడు... భయపడి...

సీత:- (ఇంట్లోకిపోయి ఆతురతతో తిరిగివస్తూవుంటే... వాకిట్లోంచి గోపీ రెండు చేతులతో చచ్చిపోయిన కమలను ఎత్తుకొని ప్రవేశించి తల్లికప్పగిస్తూ).

గోపీ:- అమ్మా... నీబిడ్డ... కమల...

సీత:- ఆ... కమలే... నాకమలే.

గోపీ:- అమ్మా... నీకమలే దేశకల్లోలానికి ప్రథమ బలిదానం...

రామ:- (ప్రవేశించి) గోపీ కమలేది... కమలా... (అంటూ ఏడుస్తాడు.)

గోపీ:- నాన్నా నువ్వూ ఏడుస్తున్నావా? నీకు పుట్టిన కూతురు సామాన్యరాలా నాన్నా... నీకంటే ముందే పోలీసు తుపాకికి బలిఅయిందినాన్నా, దేశంకోసం తనవిధి నెరవేర్చుకొంది నాన్నా.

వెంకన్న:- (ప్రవేశించి) బాబూ పోలీసులు... అయ్యగారి కోసం...

రామః- ఆ, వస్తున్నా... గోపీ నేపోయివస్తా... వాళ్ళు కని పెట్టుకున్నారు.

సీత:- అయ్యో, బిడ్డనువదలి.... కమలను వదలిపోతున్నారా.

రామ:- (ఏడుస్తూ) కమలా....

గోపీ:- నాన్నా వాళ్ళు పిలుస్తున్నారుపో....

రామ:- పోతున్నా... గోపీ (గోపిని కౌగలించుకొంటాడు) నా కమలను వదలిపోతున్నా... కమలా, నాకోసం వచ్చి బలి అయ్యావా? (పోలేక పోలేక పోతాడు)

గోపీ:- కమలా.... (శవంపై వాలి ఏడుస్తూ కొంతసేపయిం తర్వాత కోపంతో అక్కడున్నకర్రతీసుకొని) ఉండు, ఆ ఇన స్పెక్టర్గిన్ని చంపేస్తా(వెంకన్న సీతమ్మపట్టుకుంటారు)అమ్మా నన్నొదులు, నాచెల్లెల్ని చంపిన ఆద్రోహిని చంపాల్సిందే.

వెంకన్న:- బాబూ, ఆగండి బాబూ, మీనాన్నగారి తర్వాత ఇంటికి పెద్దదిక్కు నీవే బాబూ నీవుకూడా పోలీసులకు చిక్కితే.... ఇక మాగతి.

సీత:- గోపీ.... నిన్నుకూడా చూచి శాంతిపడే అదృష్టంలేదా నాకు.... నువ్వుకూడా నన్ను కష్టపెడ్తావా....

గోపీ:- అమ్మా.... (అంటూ విచారం ఆపుకోలేక తల్లిమీద వాలి ఏడుస్తాడు.)

సీత:- గోపీ.... (అందరు విచారంగా యుండగా తెరపడుతుంది)

(తెరలోనుండి పాట వినిపిస్తుంది.)

—♦ పాట ♦—

కమలా .... ....
దేశంకోసం బలిఅయ్యావా....
దేశంలో చెలరేగిన
కల్లోలపు దావాగ్నికి
పరిధమంగా, వీరబాలవు
బలిఅయ్యావా.... దేశంకోసం బలిఅయ్యావా....



# 2

(రేడియోరంగం ప్రదర్శించేముందు ఈ క్రిందిమాటలు చదవాలి)

1942 సం॥ ఆగస్టు 8వ తేదీన బొంబాయిలో అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశమయింది. సమావేశం పూర్తి కాకముందే 9 వ తేదీ తెల్ల వారుజామున నాయకులందర్నీ బ్రిటిష్‌ప్రభుత్వం నిర్బంధించింది. దాంతో దేశమంతా అంధకారం ఆవరించింది. ప్రజలు దారి తెన్నూ లేక తమ నాయకులను గోల్పోయి వెర్రెత్తిన వారిలాగా దేశమంతా కలయదొక్కారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామంతో ఆరంభమయిన కల్లోలంతో భారతదేశంలోని కల్లోలం ద్వితీయఘట్టానికి చేరింది. పతాకోత్సవాలు, ఊరేగింపులపై జరిపిన బాష్పవాయు ప్రయోగం, లాఠీచార్జీలు, తుపాకి కాల్పులతో ప్రజలలో మరీ సంక్షోభం కల్గింది దేశంలో అశాంతి చెల రేగింది.

కల్లోలం......కల్లోలం........తిరిగి కల్లోలం.

ఈ పరిస్థితుల్లో రామదాసుకుటుంబం.

# రెండోరంగం

[తెరఎత్తగా రామదాసు గృహం కనిపిస్తుంది. సమయం సా. 5 గం. సీతమ్మ రాట్నం వడుకుతూవుంటుంది. వెంకన్న లాంతర్లు తుడుస్తూ వుంటాడు. తెరలోనుంచి "పాడవే రాట్నమా" అనేగీతం వినిపిస్తుంది.]

సీతమ్మ:- (పాట అయిపోగానే) వెంకన్నా!

వెం:- అమ్మా?

సీత:- అయ్యగారింకా రాలేదే! ఎక్కడున్నారో ఏమో, ఎవరింటికి రమ్మంటే ఆయింటిలోనే మఠం. ఎక్కడ ఉపన్యాసాలిస్తున్నారో......ఏమో! వూరంతా హడావిడిగావుంది కూడాను. కొంచెం చూచిరా నాయినా ఎక్కడున్నారో ఏమిటో!

వెంక:- అలాగేనమ్మా. (వెళ్ళిపోతాడు.)

(కొంతసేపటికి రామదాసు ప్రవేశం.)

సీత:- (చూచి, ఆతృతతో) వచ్చారా! మీకోసం వెంకన్నను పంపానే! కనపడలేదా ఏమిటి? అదిగాకపోయినా, నేనంటే మీకు కోపంగాని వూరంతా హడావిడిగాఉంటే మీరు బయలుదేరడ మేమిటండీ?

రామ:- ఏమీలేదే, రేడియోదగ్గర కూర్చున్నా ఆ రమణయ్యవాళ్ళూ మాట్లాడుతూవుంటే. ఇంతలో వెంకన్నొచ్చి చెప్పాడు నీవు రమ్మన్నావని.

సీత:- ఇద్దరు కొడుకులుండగా కాళ్ళీడ్చుకుంటూ ఊరందాక వెళ్ళడ మెందుకు? ఆ సంగతులన్నీ వాళ్ళు చెప్పరూ? రాచకీయాలు...రాచకీయాలు...ఈ రాచకీయాలేగా నా కన్న తల్లిని, నా చిట్టికమలను పొట్టనెట్టుకుంది. ఒకప్రక్క మిమ్మల్ని అరెస్టుచేసి తీసికెళ్లడం, రెండోప్రక్క నా చిట్టి కమల బలితో కడుపులోమంట-అబ్బ...అప్పటికష్టాలు... (చెప్పలేక బాధపడ్తుంది.)

రామ:-పిచ్చిదానా, ఏడుస్తే కష్టాలకు అంతువుంటుందా? కష్టాలనుసహిస్తూ మనవిధులు చేయడం మానవధర్మం...... వూరుకో...

సీత-: (తెప్పరిల్లినట్లుగా) మనకష్టాలు ఎప్పుడూ వుంటాయి. శాస్త్ర నిష్టతో ఆపిన భగవద్గీత పూర్తి చేయండి వింటాను.

రామ:- అలాగే! (అంటూ భగవద్గీతలోని ఒకశ్లోకం చదువుతాడు.)

(ఈలోపల గోపీ ప్రవేశం.)

గోపీ:- నాన్నా, నాన్నా!

రామ:- ఏమిటిరా?

గోపి:- నువ్వింకా యిక్కడేవున్నావానాన్నా? దేశమంతా అల్లకల్లోల మయిపోతూంటే......మన నాయకులందర్ని ఈ ఉదయం తెల్లారకముందే అరెస్టు చేశారట...ఈ పూట రేడియోలో వివరాలొచ్చాయి...వాళ్ళందర్ని ఎక్కడికి తీసుకుపోయారో జాడే తెలియదుట...ఈ సామ్రాజ్యవాదులు కడకు మనకు దారిచూపే దిక్కుకూడా లేకుండా

మనల్ని అధోగతి పాలుచేస్తున్నారు. కాంగ్రెసు సంస్థను నిషేధించారు...కాంగ్రెసు పతాకాన్ని నేలరాస్తున్నారు. ఏం నాన్నా మాట్లాడవు? ఇది విన్నావా అరుణా అసఫాలి పతాకారోహణ చేస్తుంటే వాళ్ళమీద తుపాకులు పేల్చారట...ఆమె అయితే తప్పించుకు చిక్కకుండా పారిపోయిందటలే...నాన్నా! ఇపుడేంచెయ్యాలి మనం!

రామ:- గోపీ! ఇక సహించలేం...పద మనంకూడా సత్యాగ్రహం చేద్దాం...మనంకూడా మన నాయకులదగ్గరకు పోదాం.

గోపీ:- నాన్నా! తెలిసుండే మాట్లాడుతున్నావా? నాయకులతోపాటు మనమూపోతే జాతికి దారిచూపేదెవరు? అధోగతిలోవున్న మనప్రజకు మార్గదర్శకులెవరు? వద్దునాన్నా వద్దు. నామాటవిను సత్యాగ్రహం వద్దు.

రామ:- (వారిస్తూ) సత్యాగ్రహంతోనేగాని వాళ్లకళ్ళు తెరువబడవు. లే! ప్రజల్నందర్ని సమకూర్చు.. సత్యాగ్రహం చేద్దాం!

సీత:- ఏమిటండీ? మళ్ళీ సత్యాగ్రహమా? సత్యాగ్రహం... చట్టుబండలు...ఈ సత్యాగ్రహాలేగా నా చిట్టితల్లిని నాశనం చేసింది. ఈ కాంగ్రెసేగా (అటూ గాంధీపటాన్నిచూస్తూ) మాకొంప తీస్తోంది వేలెడుపిలక బోసినోరుతో మాకొంప సంనాశనం చేస్తున్నావయ్యా..... నీరోగం వదిలిస్తానుండు (అంటూ కర్రతో కొట్టబోతే గోపి ఆపుతూ,)

గోపి:-అమ్మా! ఏమిటిది? అదే నేను అంటున్నా.....నాన్న జైలుకు వెళ్ళకులే నువ్వు లోపలకుపో అమ్మా...పెద్దదా

నివి నీకు నేచెప్పాలా! (అంటూ లోపలకు పంపుతాడు.)
నాన్నా చూస్తున్నావా? సత్యాగ్రహంచేసి చేతులు ముడుచుకొని జైల్లో కూర్చునేకంటె ప్రజల్లో విప్లవం బయలుదేరదీయాలి. అప్పటికిగాని ఈ తెల్లవాళ్ళకు అంతంలేదు....
గాంధీ ఏమన్నాడు "చావో బ్రతుకో" తేలాల్సిందే!

రామ:- గోపీ! నామాటవిను. దేశమంతా సత్యాగ్రహంచేస్తుంటే మనం ఇంట్లోకూర్చుంటామా? లేదు. గోపీ! సత్యాగ్రహమే శరణ్యం.

గోపి:- అంతేనా నాన్నా?

(వాసు ప్రవేశం.)

వాసు:- నాన్నా! ఏమిటీ సంరంభం? ఎక్కడికీ ప్రయాణం?

గోపి:- వాసూ! తెలియనట్లు మాట్లాడతావేం? దేశమంతా క్విట్ ఇండియా రిజల్యూషన్‌తో కల్లోలపడుతోంటే చీమున్నా కుట్టనట్లు మాట్లాడతావేం?

వాసు:- ఓ ఆ రిజల్యూషనా! అసలు మీకు మతిచెడింది. కాకపోతే ప్రపంచంలో ప్రజాయుద్ధం జోరుగా జరుగుతూవుంటే ఇంగ్లీషువారితో పోట్లాడటాని కిదేనాసమయం! స్టాలిన్ ఏమన్నాడు? "ఇది ప్రజాయుద్ధం— ఫాసిజాన్ని నిర్మూలించాలి" ఈ పేపరు చదివావా...ఈయుద్ధం ప్రజాయుద్ధమో కాదో తెలుస్తుంది.

గోపి:- చాల్లే వూరుకో. తల్లి పాలుతాగి రొమ్ముగుద్దేరకం మీకు జాతీ నీతీ వుంటే రష్యా అండ పలుకుతావుట్రా "సామ్రాజ్యవాద యుద్ధమో సామ్రాజ్యవాద యుద్ధమో" అని నిన్నటిదాక అరచిన మీకు అప్పుడే ప్రజాయుద్ధ

మయింది! ఎంతలో స్లేటు ఫిరాయించారు! ఎంతకైనాతగు దురు నాయనలు రష్యామానసపుత్రులు.

రామ:- మీ ఇద్దరు కొట్టుకోక అసలు చేయవలసినపనిఏమిటో తేల్చండి.

వాసు:- ఇంకా తేలేదేమిటి? కాంగ్రెసు పప్పులో కాలువేసింది. ఈ సోషలిస్టురకం దానికి వదంపాడింది. ఇప్పటికైనా నా మాటవినండి. రేపు మనవూరికి సార్జెంటు వస్తున్నాడు. అంతా ప్రజాయుద్ధంలో చేరుదాం! తగినసహాయం చేద్దాం యుద్ధానికి, అటుచూడండి, తూర్పునుండి జపాన్ తరుముకొ స్తోంది దాన్ని ఎదుర్కోవాలి. ఇదికాదు తెల్లవాళ్లు పోవ డానికి సమయం!

గోపి:- (కోపంతో) ఇదికాదూ? ఇంకా నెత్తినెక్కించుకో. ఇనాళ్ళూ మా కమ్యూనిస్టుల్ని కాంగ్రెసు సోషలిస్టుపార్టీ లోఉంచుకొని చాలా పాపంచేశాం... తెలిసింది బాగా తెలి సింది. దేశద్రోహపు పార్టీ అని.

వాసు:- ఇంకా నీవునమ్మకపోతే, నాన్నా! మీగాంధీజీ వియ్యం కుడులేడూ చక్రవర్తుల రాజగోపాలాచార్యులుగారు ఆయ నేమన్నాడు! బ్రిటిషువారితోటి కయ్యంపనికిరాదని స్పష్టం గా నొక్కిచెప్పాడు. అంతేకాదు మీ క్విట్ ఇండియా రిజ ల్యూషన్ని ఖండిస్తు వర్కింగుకమిటీకి రాజీనామా ఇచ్చా డు. రాజాజీ గొప్ప మేధావి. ఏనాటికైనా ప్రభుత్వాం ఆయన్నే గుర్తిస్తుంది ప్రజానేతగా.

గోపి:- గురాన్ని కట్టేయి తమ్ముడూ; రాజాజీ ఒక రాజకీయ వేత్త, నీవు ఒక ఆర్థిక వేత్తవి...స్వార్థపరులు...జైలుకు

పోవలసి వస్తుందనో లేకపోతే ఆమాటంటే మక్కిలిరగ తంతారనో...

రామ:- అబ్బ, వూరుకోందురూ, గోపీ నువ్వైనా నామాట విను. పొద్దూకులోంది పద వెళదాం.

గోపి.- నాన్నా! జైల్లోకివెళ్ళి మనం చేసేదేమీలేదు. ప్రజల్లోకి పోదాం రా! నిర్దిష్టమైన ప్లానులతో ప్రజలను ముందడుగు వేయిద్దాం. ఈ తెల్లవారిని తెగనంపుదాం. వాసు కేంలే! వాను వాగుతాడు బాధ్యతారహితుడు. మనం జైలుకు ఎప్పుడు వెడతామా, మనపేరు చెప్పుకొని ఎప్పుడు బ్రతుకు దామా అని చూస్తున్నాడు.

వాసు:- మీపేరు చెప్పుకోనేటంత గతేమొచ్చింది, సోదరా మాకు మా రష్యాయే మాకండ. మా జోషీయే మా నాయకుడు. మా స్టాలినే మాపాలిటి అధినేత.

రామ:- అబ్బ మీ ఇద్దరికి ఒక్కనిముషం పడదురా, పదండి హరతాలు చేద్దాం...బహిరంగసభలు జరుపుదాం...ఊరే గింపులు తీద్దాం...ప్రభుత్వపు ప్రతిశాసనాన్ని ఎదిరిద్దాం సత్యాగ్రహంతో!

(వెంకన్న రొమ్ముబాదుకొంటూ ప్రవేశించి)

వెంక:- అయ్యా, అయ్యా!

రామ & గోపి:- ఏమిట్రా?

వెంక:- పోలీసులు...పోలీసులు.

గోపి:- ఆ! పోలీసులా?

రామ:- ఇక్కడికే వచ్చారూ? నేను అక్కడికి వెళ్ళాల్సినశ్రమ తప్పింది.

గోపి:- నామాటవిను నాన్నా! జైల్లోకి వెళ్ళొద్దు. ప్రిజల్లోకి వెళదాం.

వాసు:- ఇన్నికబుర్లుచెప్పి జైలంటే భయపడతారేం?

గోపి:- ఛీ! నోర్మూయ్!

రామ:- గోపీ! నే పోతా... బాపూజీయే నాకాదర్శం.

(ఇంతలో సీతమ్మ ప్రవేశం.)

సీత:- వెళ్తున్నారా? మీమాటే మీదన్నమాట...సరే నేను వస్తున్నా పదండి వెళ్దాం! నేను మీదగ్గరే వుంటా.

రామ:- ఛా! నీవుగూడానా? తప్పు తప్పు నే వెళ్ళొస్తా, అబ్బా యిల్ని చూచేవాళ్లెవరూ?

వాసు:- (అపహాసంతో) ఆ మహాపురుషుని భార్యకాదా, ఈ లోకోత్తమునితల్లికాదా! అమ్మా నీవుకూడ వెళ్ళొచ్చమ్మా (మారుస్తూ) చాల్ చాల్లేవమ్మా! నీకుకూడా మతిపోయిందాయేం. ఇంటిదగ్గర హాయిగా వుండలేక...అనుభవించే యోగ్యత వుండొద్దు వాళ్ళెల్లి వెలగబెడతారుగా!

రామ:- వాసూ,

గోపి:- అంతేనాన్నా! నీబోటి అనుభవజ్ఞులు నాయకత్వం వహించాల్సిందిపోయి ముసలమ్మల్లాగా జైళ్ళల్లోకి వెళతారా, వద్దునాన్నా వద్దు. రా వెళదాం వాళ్ళు వచ్చే లోపలే.

రామ:- గోపీ, నే వెళ్తున్నా. నా హృదయం ఆగడంలేదు.

గోపి:- సరే. నే వెళ్తున్నా...నా ప్రజలే నాకండ. (నమస్కరించి ప్రక్కగా వెళతాడు)

వాసు:- పిరికిపందలు ఎక్కడికిపోతారు? మనంలేమూ...

రామ:- వాసూ! బుద్ధికల్గివుండు. పెద్దవాడిచింత నాకులేదు. నీదే యింకా కుర్రితనం...(భార్యతో) ఏమాలోచిస్తావు? నన్నుపంపించు సంతోషంలో జెండా యిటుతే (విచారంలో సీతమ్మ ఆ ప్రియత్నంలో వుండగా) వెంకన్నా, నాకంటె ముందుగానే ప్రివేశించావీ ఇంట్లో. నేను నా దేశంకోసం పోతున్నా ఈ ఇల్లు కనిపెట్టివుండు. పరమాత్ముని దయ వుంటే మళ్ళీ కలుద్దాం. అహింసావలంబికి ఎక్కడా భయంలేదు. సత్యమేజీవం ధర్మమేరక్ష (జండా, టోపి ఉత్త రయ్యం యిస్తున్న భార్యతో) పిచ్చిదానా, ఏడుస్తున్నావా దేశంలోపుట్టిన ఈ శరీరం దేశానికే త్యాగం అయితే అంతకన్నా ఏంకావాలి! పోయివస్తా (అంటూ వెళ్ళిపోతాడు సీతమ్మ దుఃఖంలో కొంతదూరందాకా వెంబడిస్తుంది!)

వాసు:- (ఓదార్పు మాటలతో) అమ్మా, బెంగపడకమ్మా నేనున్నానుగా! సమయానికి రక్షించేది నేనేనని గుర్తుం చుకో! పరాయివాళ్ళలాగా తలో ఉత్తరీయం వేసుకుని చక్కాపోయారు. ఎప్పటికైనా నీ చిన్నకొడుకే రక్షించేది. జ్ఞాపకముంచుకో. నీ చిన్నకుమారుడు కామ్రేడ్ వాసే ఈ ఇంటికీ, వెంకన్నకూ పరమోపకారి. విచారపడ నవసరం లేదు...కమ్యూనిజం తెలిసిన యేపురుషుడూ, యేస్త్రీ ఒకర్నొకరు గురించి విచారించరు. రష్యాలో నీకుమల్లే ఏడ్చే అబలలు మచ్చుకుకూడా దొరకరు. రష్యామహిళలు

ఆదర్శమహిళలు. రష్యాదేశం, ఆదర్శదేశం......రష్యా విప్లవం ఇండియాకు రావాలి. అప్పటికి మన భారతదేశం సర్వ సమృద్ధమై పోతుంది......నేనటు బజారుకెళ్ళొస్తా. నన్నెవరు అరెస్టు చేయరులే. భయపడొద్దు! (అంటూ వెళ్ళిపోతాడు.)

(మెల్లగా తెర జారుతుంది.)



# 3

(మూడో రంగం ప్రదర్శించేముందు ఈ క్రిందిమాటలు చదవాలి)

1947 ఆగష్టు 15 వ తేదీతో బ్రిటిషువారు ఇండియాను వదలి వెళ్ళారు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని దేశం రెండుముక్కలయింది. మతకలహాల రక్తపాతంతో దేశం దద్దరిల్లింది. ఇరుగు పొరుగు వారిని నమ్మే అవకాశాలు అంతరించాయా అనిపించింది. బాపూజీ హృదయం స్వాతంత్ర్యం పొందామనే సంతోషం లేకపోగా దినదినం చింతతో కుమిలిపోయింది. తాను కలలుకన్న స్వరాజ్యం ఇదేనా? దేశం రక్తసిక్తం కావలసిందేనా అని తనలో చెప్పలేనంత బాధ పడుతున్నాడు. దేశంలో కల్లోలం........తిరిగి కల్లోలం ఆరంభమయింది. మతకలహాల రక్తపాతంతో దేశంలో కల్లోలం మూడవ ఘట్టానికి చేరింది.

ఈ పరిస్థితుల్లో రామదాసుకుటుంబం.

# మూడో రంగం

[పగలు 11 గం. రామదాసుగృహం. రామదాసు పేపరు చదువుతూ వుంటాడు.]

సీతమ్మ:- (ప్రవేశించి) ఏమండీ ఇంకా చదువేనా! వంటయింది లేవండి భోజనానికి!

రామ:- ఉండవే భోజనానికేం తొందరొచ్చింది! ఇదివిన్నావా? ఇదిగో ఢిల్లీదగ్గరగా ఎక్స్‌ప్రెస్ వస్తుంటే దాన్ని ఆపి, ముస్లిములందరిని హతమార్చారట. మతోన్మాదులు దేశంలో పెచ్చుపెరిగిపోయారు. "పరమత సహనం, పరమత సహనం" అని చెప్పే గాంధీజీమాట వినేవాళ్ళెవరీరోజుల్లో. దేశమంతా కల్లోలం, భీభత్సంగా వుంది.

సీత:- స్వరాజ్యమొచ్చాక అందరు సుఖపడొచ్చు. శాంతవుతుంది అనుకుంటే స్వతంత్రం వచ్చాకకూడ ఇంక ఈ కొట్టుకోవడం అవీ ఏమిటో.

రామ:- అవును. మనం ఈ ఇంట్లోంచి ఇంకో ఇంట్లోకి వెళ్లేలోపల వచ్చే తుపాన్లని, గాలిదుమారాలని ఎదుర్కొని కొత్త ఇంటికెళ్ళి సుఖపడొద్దూ, ఈ ఇల్లుమార్పిడి సమయంలో ఎన్నో విఘాతాలు వస్తూవుంటాయి. అవన్నీ ఎదుర్కొంటూ సహనంతో ముందడుగువేస్తే ఆ కొత్త ఇంట్లో చక్కగా కాపురం చెయ్యొచ్చు. దేవతలు, రాక్షసులు సముద్రాన్ని మథనం చేస్తూవుంటే సముద్రంలోనుంచి లక్ష్మి పుట్టింది, అమృతం పుట్టింది, ఐరావతం పుట్టింది

హాలాహలం పుట్టింది. లక్ష్మిని అమృతాన్ని గ్రహించి హాలాహలాన్ని హతమార్చకపోతే లోకం ఏమయ్యేది? అలాగే దేశంలోని ఈ మతవిద్వేషాన్ని హతమార్చటానికి గాంధీమహాత్ముడు అవిరామంగా పనిచేస్తున్నాడు. దానిలో గాంధీజీ తప్పక కృతకృత్యుడవుతాడు. గాంధీజీ లోలోపల చెప్పలేనంత బాధ పడుతున్నాడు. ఆయన ఈ అశాంతికి లోలోపల కుళ్ళి కుమిలిపోతున్నాడు. అబ్బ! ఎప్పటికో రామరాజ్య నిర్మాణం......స్వరాజ్యమయితే వచ్చిందికాని సురాజ్యం యింకా రాలేదు.

వెంకన్న:- (ప్రవేశించి) అయ్యా, గంగాధరంగారంట చూస్తానికొచ్చిను)

సీత:- అంతా ఇప్పుడేవస్తారు. గంగాధరం......నీలాధరం (అంటూ వెళ్ళిపోతుంది.)

రామ:- అబ్బ వుండవే, పనిలేం దేవరొస్తాగు? వెంకన్నా! రమ్మను లోపలికి.

(వెంకన్న వెడతాడు, గంగాధరం ప్రవేశిస్తాడు.)

గంగా:- నమస్తే దానుగారూ! బహుశా మీరునన్ను ఎరుగ వుండరు. నేను ఈ ఫిర్కా ఆర్. ఎస్. ఎస్. ఆర్గనైజరును.

రామ:- కూర్చోండి. నిలబడేవున్నారు!

గంగా:- ఆ, దానికేంలెండి! మీరు జిల్లాకాంగ్రెసు అధ్యక్షులు కాబట్టి మిమ్మల్నికలసి నాల్గుమాటలు మాట్లాడిపోదామని వచ్చాను. చూడండి, మనకళ్ళకు పొరలుకప్పి ఆ మ్లేచ్ఛులు సగందేశం పంచుకుపోయారు. ఈనాడు ప్రతివిషయంలోను

సగంభాగం మీదంటున్నారు. అందాకా ఎందుకు మనదగ్గరనుంచి డబ్బు గుంజుకొని మనజాతిని, మన ధర్మాన్ని నాశనంచేయాలని చూస్తున్నారు. అటువంటివాళ్లకు 55 కోట్లు యివ్వాలని ఈ ముసిలాయనకూడ బెదరిస్తూ తిండిలేక మాడతాడట! ముసిలాయనికి మతిపోయింది.

రామ:- (వారిస్తూ) చ్, చ్! ఆగండి, గంగాధరంగారూ అల్లా అనమోకండి! గాంధీజీ మీరుచెప్పినట్లు మూర్ఖుడుకాడు. వాళ్ళు అన్నదమ్ముల్లాగా విడిపోయారు. వాళ్ళభాగం వాళ్ళకివ్వొద్దూ? నామాట వినండి. గంగాధరంగారు సత్య ధర్మాలతో కూడుకొన్న విధానం ఎన్నటికి అపజయం పొందదు. రామరాజ్యానికిదే ప్రాతిపదిక.

గంగా:- రామరాజ్యమా? ఈ తురుష్కులు బ్రతికుండగానే! ఈ తురుష్కులను నమ్మకండి. కటికమాంసం తినేవాళ్ళు! చూశారుగా జిన్నాపట్టుదల...ససేమిరా విడిపోయేదాకా వూరుకోలా. ఇన్నాళ్ళబట్టి ఆ జిన్నాను నెత్తిన పెట్టుకున్న వాళ్లంతా ఇప్పుడు అనుభవించాల్సిందే! ఈనాడు మనదేశంలో నాలుగున్నరకోట్ల ముస్లిములున్నారు. వీళ్లంతా నశించన్నా నశించాలి, లేదా పాకిస్తానుకన్నా పారిపోవాలి. వేరే మార్గంలేదు. భారతదేశం హిందూరాష్ట్రం కావాల్సిందే!

రామ:- అలా అనమోకండి. హిందువులు, ముస్లిములు, పార్శీలు అన్నిజాతులకు చెందింది భారతదేశం. అన్నిజాతులూ కలసిభారతదేశ శాంతిసందేశాన్ని ప్రపంచంనలుమూలలా వెదజల్లాలి, వ్యాప్తిచెయ్యాలి. పిచ్చిగా మతోన్మాదులు

గాక జాతిక్షేమం ఆలోచించాలి ... సంకుచితదృష్టిని వదలండి. అధికులుగాఉన్న హిందూశ్రేయస్సు కెన్నడూ భంగంలేదు. రామరాజ్యానికి పునాదులు వేయండి.

గంగా:- ఆ రామరాజ్య నిర్మాణం నాలుగున్నరకోట్ల ముస్లిముల గోరీలపై కావలసిందే! అదివినా వేరే మార్గంలేదు. అసలు మీబోటివారిమూలంగానే వారింకా నెత్తినెక్కుతున్నారు. (ఇంతలో బయట "అయ్యో, అమ్మో" అంటూ కేకలు, కర్రదెబ్బలు వినిపిస్తాయి.)

రామ:- (విని) ఏమిటది? (అంటూ తెరలోకిపోయి కొంతసేపటికి మహమ్మదల్లీ అనే దెబ్బలుతిన్నముస్లిం యువకుణ్ణి వెంకన్న సాయంతో లోనికితెస్తాడు. ఆదరాభిమానాలతో నీళ్ళుచల్లి కట్లు కడతారు.)

రామ:- పాపం! ఏ కర్కశ హృదయుడిట్లా చావబాదాడో?

(గంగాధరం ఇదంతాచూస్తూ కోపంలో చురచురా చూస్తూంటాడు.)

వెంకన్న:- బాబూ, ఆచోయంసంగం లేదుబాబూ, అల్లంతా ఈయన్ని కొట్టూంటే, ఈయన కేకలేసుకుంటూ మన దర్వాజాదగ్గర పడ్డాడుబాబు! ఆళ్ళంతా ఇందూరాష్ట్రం జిందాబాద్, పాకిస్తాన్ ముర్దాబాద్ అంటూ ఎల్లిపోయారు.

గంగా:- చోయంసంగంకాదురా వెధవా! స్వయంసేవకసంఘం. పూర్తిపేరు తెలుసా? రాష్ట్రీయ స్వయంసేవకసంఘం. నేనెవరనుకొన్నావు? దానికి ఆర్గనైజరును. రామదాసుగారూ! వీణ్ని కనికరించినందుకు మీరెంతపాపం చేశారో తెలుసా?

రామ:- శరణని వాకిట్లోపడితే పాపమేమిటి?

గంగా:- పాపమా మరీపాపమా! వీడెంతమంది హిందువులను బలిగొన్నాడో... మొహంచూస్తేనే తెలుస్తుంది, ఈ పీచు గడ్డం వీడూను. (దగ్గరికివచ్చి తిన్నగాచూస్తూ) ఇంకావేం, వీడు మహమ్మదల్లీ...ఫస్టుక్లాస్ లీగ్ హెడ్. ఈ సైతాన్ని పాకిస్తానుకు పార్శిలుచేయండి రోగం కుదురుతుంది, పీడ విరగడవుతుంది,

రామ:- గంగాధరంగారూ! మీరుకొంచెం ఆగండి...

(గోపీ ప్రవేశం)

గోపీ:- ఏమిటినాన్నా! వాకిట్లో ఈ జనమంతా...పడిపోయిం దెవరో? ఈ గంగాధరాన్ని లోపలికి రానిచ్చావెందుకు?

రామ:- ఇతడు మహమ్మదల్లీరా! శరణంటూ మనవాకిట్లో పడ్డాడు. ఆర్. ఎస్. ఎస్. వాళ్ళు కొడ్తుంటే!

గోపీ:- ఈ ఆర్. ఎస్. ఎస్. వాళ్ళా? వీళ్ళకొకమాట నిలకడ వుందా? రాజకీయాలతో సంబంధం లేదనడము, కనబడిన ముస్లిమునల్లా ఇష్టంవచ్చినట్లు పరపరా కోయమనడం, మొన్ననేగా జయప్రకాశ్ నారాయణ్ ఢిల్లీలో చెప్పింది. ఈ మహాపురుషులు నెహ్రూప్రభుత్వాన్ని ఢిల్లీలో ఊరేగిస్తారుట! ఈనాటికి బయలుదేరారు దేశోద్ధారకులు...దేశ స్వాతంత్ర్యాన్ని రక్షించేవాళ్ళు...హిందూరాష్ట్రాన్ని ఉద్ధ రించేవాళ్లు. దేశమంతా అల్లోలకల్లోలంగా అంటూన్న ఆగష్టు విప్లవంలో వీళ్ళంతా ఏమైనారు! ఈనాటికి మహా బయలు దేరారు మతపైశాచిక్యాలతో... దేశాన్ని మంటకలప టానికి.

గంగా:- మా నాయకత్వానికే వంకపెట్టావ్? హిందూయువకు ల్నందర్నీ స్వయంసేవక సంఘంలో సమీకరిస్తున్నాం... దేశ రాజకీయాలతో మాకు సంబంధంలేదు. హిందూ మతోద్ధరణే మా ముఖ్య కర్తవ్యం.

(ఈలోగా మహమ్మదలీ తెప్పరిల్లి గంగాధరాన్ని చూచి అదరిపడి రామదాసు కాళ్ళపై పడ్తూ "రక్షించండి బాబు" అంటాడు.)

గంగా:- (ఉద్రేకంతో) రక్షించడం...రక్షించడంగాదు, నిన్ను భక్షించాల్సిందే!

గోపీ:- (కోపంతో) ఖబర్దార్! అతన్ని ముట్టుకొన్నావంటే...

రామ:- గంగాధరం! ఏమిటీఆగడం... నే పోయింతర్వాతే వాడి మీద చేయివేయడం.

వాసు:- (ప్రవేశించి) ఎవరునాన్నా! (చూచి) ఓహ్! గంగా ధరమా! నాయనా, మానాన్న కబురుపంపించాడారమ్మని? ముసలాయనకి ఏళ్లువస్తుంటే మతికూడా పోతోంది.

గోపీ:- వాసూ! ఇష్టంవచ్చినట్లు వాగబోకు, నాన్న నేమను కున్నావ్?

వాసు:- ఏమనుకోవడమేం, ఆర్. ఎస్. ఎస్. వాళ్ళతో దోస్తీ చేస్తున్నాడు. వీళ్లనా, నరికి ముక్కలుముక్కలు చేయాలి. (అని గంగాధరంమీదికి ఉరుకబోతాడు.)

గంగా:- అహహ, ఏం కుటుంబం! ఏం కుటుంబం! తండ్రి కాం గ్రెసు, అన్న సోషలిస్టు, తమ్ముడు కమ్యూనిస్టు...ఆశ్రి యమిచ్చింది ముస్లిం లీగు వాడికి. పైగా నన్నంటున్నావా? మాది ఒకేజాతి...హిందూజాతి...కల్తీ లేనిజాతి.

వాసు:- ఇదిగో చూచి మాట్లాడుతున్నావా? కామ్రేడ్ వాసు నీరక్తం కళ్ళచూస్తాడు పో! వాకిట్లోకి పో! (అని మీదకు పోబోతే.)

రామ:- (అడ్డుకుని) వాసూ! ఏమిటాతొందర? (గంగాధరంతో) గంగాధరం! మతవిద్వేషం మానేయి. వాళ్ళు, మనం ఇన్నాళ్ళు ఒకటిగా బ్రతికాం. మనస్సు మార్చుకో! హింస ప్రతిహింసకు దారితీస్తుంది. నిమగ్నమైవున్న కోపాన్ని ఉత్తేజింప చేస్తుంది హింస! ఒకమనిషి ఇంకోమనిషినిచంపి కక్ష తీర్చుకోవాలనడం సిగ్గుచేటు. నామాటవిను.

గంగా:- చాల్లెండి దాసుగారు! కొడుక్కు బుద్ధిచెప్పుకోలేక నన్నంటారేం? ఈ కమ్యూనిస్టులేగా పాకిస్తాన్ కావాలన్నది, జిన్నాకు మద్దతుచేసింది. ఈరోజున వీళ్లు మతోద్రేకుల విరోధులట. రైతుకూలీ సంరక్షకులట. ఎంతలో ఎంత ప్లేటు ఫిరాయింపు! ప్రజాయుద్ధం, పాకిస్తాను వీరప్రకటనలు జిన్నాదేమో ప్రోగ్రెసీవ్ పంథాట! మాదేమో మత విద్వేషంట.

వాసు:- చాలుచాలు పోవయ్యా! మాకిప్పుడే స్వాతంత్ర్యం వచ్చింది, మాదేశం స్వరాజ్యం అయింది. దాన్ని నిలవ తొక్కుకోవాలి, నెహ్రూ ప్రభుత్వాన్ని బలపరచాలి... అసలు నిన్నింటిలోకి రానిచ్చినవాడిది బుద్ధితక్కువ. ముందు నీవు పోతావా పోవా? (మెడపట్టుకు గెంటుతూంటే)

గంగా:- ఇంతకింత అనుభవిస్తారు...స్వయంసేవకుని కష్టపెట్టిన వారెవరు బాగుపడలా...ఆర్. ఎస్. ఎస్. పగ తాచుపగ ఖబడ్దార్!

వాసు:— వడ్డావ్! పో......

(గంగాధరం కొరకొరా చూస్తూ వెళ్ళిపోతాడు.)

రామ:- (మహమ్మదల్లీతో) నాయనా! భయపడకద్దు. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొని మతపుమాటలు మానెయ్యి.

మహమ్మదల్లీ:- రామదాసుగారూ! నాప్రాణాల్ని కాపాడారు. జిన్నా లీగ్ అని పేరుచెప్పి మాకొంపలు నిలువునా కూల్చాడు. పాకిస్తాన్ తీసుకున్నాడేగాని మా అందరిగతి ఏమాలోచించాడు...పైగా ఈ కమ్యూనిస్టులుకూడా అది మంచిదేనంటూ బలపర్చారు. ఇప్పుడు అనుభవిస్తున్నాం... నా పెళ్ళాం బిడ్డలు ఎట్లావున్నారో?

గోపీ:— ఒక్క నీ పెళ్ళామేమిటి...ఆ పంజాబుప్రాంతంలో ఎన్ని కుటుంబాలు నాశనమయ్యాయో...ఈ దేశవిభజనే కొంప తీసింది. పాకిస్తాన్‌నుంచి వచ్చే హిందువుల్ని సరిహద్దుల్లో ముస్లిములు మింగేస్తున్నారు. ఇక్కడనుంచి వెళ్ళే ముస్లిముల్ని హిందువులు బలికొంటున్నారు. ఇదీ ఈనాటి పరిస్థితి ..ఇదీ మనం అనుభవించే స్వాతంత్ర్యం...హత్యలు ఎక్కడచూచినా హత్యలు...కల్లోలం......దేశమంతా కల్లోలం...భీభత్సం... సంక్షోభం... గాంధీజీ విశ్రాంతి లేకుండా దాన్ని అణచటానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ కల్లోలాన్నణచకల్గాడా ధన్యుడు. దేశవిభజన వద్దంటూన్నా వినకుండా మన నాయకులు తెల్లవాళ్ళ మాటవిని ఒప్పుకున్నారు. నాన్నా! చూశావుగా ఫలితం?

సీత:-(ప్రవేశించి) ఏమండీ! అయ్యాయా చర్చలు? ఇంకేమన్నా ఉన్నాయా? వంటలన్నీ చప్పచల్లారిపోయాయి. (చూచి) అరే ఎవరో వున్నారే?

రామ:- వెంకన్నా ఒకబండీపిలు,...వాసూ! కొంచెం ఆస్పత్రికి తీసుకుపోయి చేర్పించు మహమ్మదల్లీని...మంచిది పోయిరా నాయనా! దెబ్బలు నయం అవగానే మళ్ళా వస్తావుకదూ?

మహ్మ:- తప్పకబాబు! నా ప్రాణాన్ని రక్షించారు.

రామ:- ఆ...దానికేంలే! పోయిరా.

మహమ్మదల్లీ, వెంకన్న, వాసు వెళ్ళిపోగానే తక్కిన వారు యిట్లోకి వెళ్ళిపోతూంటే తెర.)



# 4

## (నాలుగోరంగం ప్రదర్శించేముందు ఈ క్రిందిమాటలు చదవాలి)

## సమయం 1949 మార్చినెల

దేశం స్వాతంత్ర్యం పొందగానే కాంగ్రెసునాయకులంతా అధికారాన్ని స్వీకరించారు. పదవిలోకి రాకముందు చేసిన వాగ్దానాలన్నీ పదవిలోకి రాగానే నెరవేర్చలేకపోయారు. దేశపరిస్థితులన్నీ తారుమారయినాయి. దాంతో ప్రజలంతా నిస్పృహులయ్యారు. గాంధీజీ, దేశంలో కాంగ్రెస్ పేరుతో జరుగుచున్న అమానుషత్వానికి లోలోపల కుళ్ళిపడ్డాడు. పైకి చెప్పుకోలేక లోలోపల కుమిలిపోయాడు. కాంగ్రెసు సంస్థను సోషలిస్టుల కప్పగించాలని కృషిచేసి విఫలుడయ్యాడు. చివరకు కాంగ్రెస్‌ను రద్దుచేయమనికూడా సలహా యిచ్చాడు. దేశంలో మతోన్మాదాన్ని పూర్తిగా నశింపజేయడానికి ప్రయత్నంచేస్తున్న సమయంలో ఒక మతోన్మాది, ఒక పిచ్చివాడు, ఒక మూర్ఖుడు తుపాకిగుండుతో హతమార్చాడు బాపూజీని. దానితో దేశమంతా అంధకారబంధుర మైపోయింది. గాంధీజీ అంతర్ధానంతో సోషలిస్టులు, కాంగ్రెస్‌నుండి బైదొలగారు. ప్రభుత్వపక్షమయిన కాంగ్రెసుకు, ప్రత్యక్షపక్షమై ప్రజాస్వామ్యాన్ని కాపాడుతూ దేశపురోగమనానికి కృషి చేస్తున్నామంటున్నారు.

"నెహ్రూప్రభుత్వాన్ని బలపరచండి" అన్న కమ్యూనిస్టులు తిరిగి "నెహ్రూ ముర్దాబాద్, నెహ్రూ సర్కార్ ముర్దాబాద్" అంటూ ఒకరకమైన విప్లవాన్ని లేవదీస్తున్నామంటున్నారు. ఇదే సమయంలో రజాకార్ల రాక్షసత్వం హైదరాబాద్ సంస్థానంలో నగ్నతాండవం చేస్తూ ఉంటే ఇండియాప్రభుత్వం తరఫున పోలీసుచర్య జరిగింది. దాంతో ఒక కోటి 67 లక్షల ప్రజలు రాక్షసత్వాన్నించి రక్షింపబడ్డారు. మిలిటరీ ప్రభుత్వం వచ్చిందికాని పరిస్థితులన్నీ పూర్తిగా చక్కబడలేదు. దేశమంతా నిరాశా, ఆర్థికసంక్షోభం, జీవితావసరాల కొరత, బ్లాక్‌మార్కెటులతో జీవనసమస్య కష్టతరమయింది. దాంతో తిరిగి కల్లోలం...... ద్వితీయ సంగ్రామంతో ఆరంభమయిన మహాకల్లోలంతో భారతదేశంలోని కల్లోలం నాల్గవఘట్టానికి చేరింది. ఈ పరిస్థితుల్లో రామదాసు కుటుంబం.....అదేగృహం......వారే మనుష్యులు.......

# నాలుగో రంగం

[సమయం : రాత్రి 9 గంటలు. తెరఎత్తగా బిచ్చగాడు పాటలో ప్రవేశిస్తాడు. ఆ పాటవింటూ సీతమ్మ ముష్టితో ప్రవేశం; వెనక రామదాసుకూడా విచారిస్తూ, బిచ్చగాడిపాట మెచ్చుకుంటూ ప్రవేశం.]

## —♦ బిచ్చగాడి పాట ♦—

(శ్రీ చంద్రశేఖర కణ్వశ్రీగారి "ఇదాప్రపంచం" అనే నాటకంలోనిది)

రాలిపోయెరో ఆకాశపు ధ్రువతారా, రాలిపోయెరో......
గణగణమండే జ్యోతి ఆరిపోయెరో
ముసిముసినవ్వుల బోసినోటి మనతాతా
తప్పటడుగుల బులిబులిపాపాయి మనతాతా
మక్కమీద వేలితోడ లోకాన్నె జడిపించి
స్వాతంత్ర్యం చూపించిన బుద్ధుడు మనతాతా, సిద్ధుడు
మనతాతా ॥రాలిపోయెరో॥

సూర్యుడు కన్నెర్రజేసి పడమర కెల్లాడూ
సందెరంగు రక్తాన్నె వుక్కిలించినాడూ
ప్రార్థనసభకు తాతయ్యా గబగబ ఎల్లాడూ
ఢాం, ఢాం, ఢాం, అని ఎటునుంచో పిడుగులురాలాయీ
పిడుగులు రాలాయీ
హే రాం హే రాం అంటూ కూలాడూ తాతయ్యా,

ముసలిగుండె పెటిలిపోయి నెత్తురొలికిపోయింది
పాడలిపోయి కైలాసం ధడధడ విరిగిందీ
పగిలిపోయి రగిలిందీ........॥రాలిపోయెరో॥
వలవల ఏడ్చిం దీలోకం
కన్నీళ్ళు కార్చిందీ
నిదరోయే తాతయ్యతో పూలతేరు కదలిందీ
గణగణగణ గుడిగంటలు గాలికి మోగాయీ
పుట్టెడు అగ్గుల్లో తాతయ్యను తోశారూ
యమునమ్మ గుండెపగిలి మంటలు కక్కిందీ
పొగలు ఎగసి లోకాన్నే కబళించాయీ.......
చీకటి కమ్మిందీ.....చీకటి కమ్మిందీ......చీకటి కమ్మిందీ....

సీత:- (ముష్టివేసి బిచ్చగాడ్ని పంపివేస్తూ) అబ్బ! ఎంతచక్కగా పాడాడండీ...విషయమంతా కళ్ళకు కట్టినట్లుంది. అబ్బ చేతులెట్లా వచ్చాయో వాడికి చంపటానికి?

రామ:- మహాత్ముడు మనల్ని వదలిపోయాడు. సత్యధర్మాలకి యిక స్థానంలేదు. శాంతిసూక్తులు చెప్పేవాళ్ళే లేరా? పదవుల్లోకి రాగానే కాంగ్రెస్ పేరుతో జరిగే యీ దోపిడీని అరికట్టేవాళ్లే లేరా?......ఆయనైనా ఉంటే యింతవరకయినా హద్దులోఉంది ..దేశస్వాతంత్ర్య సంపాదనతోనే కాంగ్రెస్ సంస్థ అంతమా?

సీత:-పాట్నానుండి గోపీ యింకా రాలేదుగా? ఉన్నవాళ్ళుఊరుకోకుండా పాట్నాలో ఏమిటో...నాకేమీ అర్థంకావటం

లేదు......మనం చెప్పేరోజులు దాటిపోయినాయి. ఏం చేస్తాం! సర్వేశ్వరా నీవే రక్షించు వీళ్ళను.

రామ:- వస్తాడులే! ఆదుర్దా దేనికి? వీళ్ళసమావేశం నాగపూరులో జరుగుతుందనుకున్నారులే మొదట...కాని ప్రభుత్వం నిషేధిస్తే పాట్నాలో పెట్టుకున్నారులే...వస్తాడు... చిన్నవాడుచూస్తే ఆమాదిరి...ఇవ్వాళో రేపో అరెస్టు చేస్తామంటోంది గవర్నమెంటు. వీడేమో తప్పించుకు తిరుగుతున్నాడు. ఘడియ ఘడియకు వేషాలు మార్చుకుంటూ ధనికవర్గాన్ని దోస్తామంటూ హింస ప్రేరేపిస్తున్నాడు. పరమాత్మా! వీళ్ళని అంధత్వంలోనించి బయటపడేయ్... దారిచూపు...నీవే మాకండ.

సీత:- నిజమే! పెద్దవాడితో నాకేబెంగాలేదు. చిన్నవాడి విషయమే మరీ ఆదుర్దాగాఉంది. ఇంతున్నాడో లేదో వీడికి అందరిమీదా కక్షలూ, పగలూను...ఏం జరుగుతుందో ఏమో (ఆగి) అయితే, ఒక్కవిషయం అడగాలనుకున్నాను. గవర్నమెంటూ, ఆరోజుల్లో జైళ్ళకెళ్ళినవాళ్ళకి, దెబ్బలు తిన్నవాళ్ళకి పొలాలిస్తున్నారుటగా! ఆబాపతు మీకేమీ రావద్దూ? ఎవరు మెన్ని ఎక్కువదెబ్బలుతిని కష్టపడిఉంటే అన్ని ఎకరాలు యిస్తారా ఏం?

రామ:- (నవ్వుతూ) అదికాదే! పాపం ఆరోజుల్లో రాజకీయాలవల్ల కుటుంబాలు నాశనమయినవారికి, చితికిపోయినవారికి గవర్నమెంటు సహాయం చేస్తోంది.

సీత:- అయితే రాజకీయాలవల్లేగా మనకొంపీ గతికివచ్చింది! ముత్యంవంటి పిల్లనుకాస్తా ఆ రాజకీయాలేగా మింగేసింది.

ఈ రాజకీయాలవల్లేగా ముసలితనం వస్తున్నా తగినంతధనం లేక మీరూ నేనూ కష్టపడుతున్నది. మీతోపాటు చదువుకున్న వీరాస్వామి యిప్పుడు యీజిల్లాకు కలెక్టరయ్యాడు, మీకు తెలుసుగా... ఈ రాజకీయాలేగా మన పెద్ద బ్బాయినీ, చిన్నబ్బాయినీ విశ్రాంతిలేకుండా ఊళ్లు తిప్పుతున్నది. పెద్దవాణ్ణేమో సోషలిస్టుచేసితిరి, చిన్నవాడేమో కమ్యూనిస్టు అయ్యాడు. రాజకీయాలవల్ల మనకుటుంబం నాశనం కాలేదని ఎవడైనా చెప్పగలడా? మీ పుస్తకాలు, మీ దుస్తులు, అంతేకాదు ఈగది, ఈయిల్లు, సమస్తమూ రాజకీయాల్లో మున్గితేలింది. ఇంకేంకావాలండీ మనకా పొలాలు రావడానికి?

రామ:- అబ్బ! ఎంత ఉపన్యాసం యిచ్చావు పొలాలకోసం! పాపం! అసలుసంగతి చెబితే విచారిస్తావేమో...నాకూ యిస్తామన్నారు కాని......

సీత:- కాని, కాని ఏమిటి? కొంపతీసి ఒద్దనలేదుకదా? అంత వారుకూడాను.

రామ:- తొందరపడమోకు పిచ్చిదానా! మనంచేస్తున్న దేశ సేవ ప్రతిఫలంకోసమా?

సీత:- అయిందీ, యింతకీ వద్దని చెప్పేరన్నమాట!

రామ:- ఆగు...నాకియ్యబోయే ఆపొలాల ధనంతో నీకూతురుపేరుతో ఒక ఆస్పత్రి కట్టించమనిచెప్పా! అంతకంటె వంకావాలి నీకు?

సీత:- ఆస్పత్రి కట్టిస్తే మనకేంవస్తుందండి! మీరెప్పుడూఇంతే. ఏదిముందో, ఏదివెనకో తెలియదుకదా? మనకెన్నాళ్ళు

యిట్లాకష్టాలు? స్వతంత్రం వచ్చిందన్నమాటేగాని అంద రికి పూర్తిగా కట్టుకొనేందుకు బట్టాదొరకదు, తినేందకు తిండీదొరకదు. ఆ ఇంగ్లీషువాళ్లున్నప్పుడే నయమల్లేవుంది. అయితే ఇప్పుడు జిల్లాకాంగ్రెస్ ప్రెశిడెంటు కోమటి కేశ వులు గుప్తటగా! ఇన్నాళ్ళూ బాగా బ్లాకుమార్కెటు చేశాడనా ఆయనకిచ్చారీపదవి? కష్టాలరోజుల్లో మీరు ప్రెశిడెంటూ, సుఖపడేరోజుల్లో వాళ్ళకా ఆ అదృష్టం? గీత ఉండొద్దూ...దాసుగారంతమనిషి లేరంటే పొంగిపో తారు. చూడండి, కేశవులుగుప్తకేం తక్కువా? కావలసి నన్ని బియ్యం, కిరసనాయిలు, బట్టలూ సమస్తం, ఏ గవర్న మెంటు ఆఫీసరొచ్చినా ఆయన్ని కార్లో తీసుకెడతాడు. ఇంతకీ మనకర్మ...స్వతంత్రంవచ్చినా మాడడం...

రామ:- (నవ్వుతూ) పిచ్చిదానా, మనఘటాలు ఇట్లా కష్టద శలో గడచిపోవాల్సిందే! నీ కొడుకులు, నీ మనుమలు నీ విపుడునాటిన చెట్లపండ్లుతిని సుఖపడతారు. ఇక భారత దేశంలో పుట్టబోయేవారందరూఅదృష్టవంతులే అవుతారు. మహాత్ముడు మనకు నేర్పిన త్యాగాన్ని అపుడే మరుస్తామా! పిచ్చిదానా, నారుపోసినవాడు నీరు పొయ్యడూ!

(ఇలా అంటూండగా వెంకన్న కాఫీసీసా, రేషనుకార్డులు, కాఫీసంచులతో ప్రవేశిస్తాడు)

సీత:- (చూచి) వెంకన్నా! నల్లమందు బాగా పడిందావం యివ్వాళ? మత్తుగావుంది వ్యవహారం. ఓరి నీ అఘాయిత్యం మండా, ఐదుగంటలకి రేషనుకొట్టుకి వెళ్ళినవాడివి ఎనిమిది దాటింది యిప్పుడా రావడం?

వెంక:- అదికాదమ్మా......

సీత:- (కాళీసంచుల్నూ, సీసా చూస్తూ) బియ్యం, కిర్సనాయిలు తీసుకురాలేదేం? ఎక్కడున్నావ్ ఇంతసేపూ?

రామ:- వాడిమాట వినవే వినవేం?

వెంక:- ఐదు కొట్టంగనే వెళ్ళినా ఆకొట్టుకి. దుకాణంకాడికి వందమందిదాకా వచ్చారు. పోలీసోళ్లకిమల్లె లైనులో నిల బెట్టి బియ్యం యిస్తున్నారమ్మా! మంది అంతాచేరి నన్నో మూలకి తోశేశారమ్మా...నామాట వినేవాడెవడక్కడ? చివరకు కూపన్లమీద బియ్యం యివ్వవయ్యా అంటే "అయిపోయినాయి, రేపు రమ్మన్నాడు" నేనెంతో బతి మాలినా, నచ్చినా యినందే, లేవు పొమ్మన్నాడు. నేను వస్తూంటే కోమటి కేశవులుగారి మనిసొస్తే ఆడికి అర మూటబియ్యం యిచ్చి తలుపేశాడు. నచ్చినంతొట్టు నే నల్లమందే తినలేదివాళ.

సీత:- ఆ చాలీచాలని బియ్యమైనా నీవు తెస్తావేమోనని చూసి చూసి, ఎంతకీ రాకపోతే పక్కింటి రమణయ్యగారిం ట్లోంచి బియ్యంతెప్పించి, అయ్యగారికిపెట్టా. రామ, రామ ఏంకాలం వచ్చిపడిందిరా, మాయదారికాలం...పెట్టుకుం దుకు నగల్లేకపోతేమానె, కట్టుకుందుకు అనువైన చీరలు లేకపోయినా, తినేందుకు ఇంత తిండయినా లేకపోతే బతి కేదెట్లా? కొడుకులున్నారన్న మాటేగాని యింటిగొడవ ఎవడికక్కావాలి? దేశాన్ని ఉద్ధరిస్తారట! మహాప్రభో రామ చంద్రా...కన్నాను, దేశంమీద వదలిపెట్టాను. పెళ్ళిళ్ళా లేవు, పేటాకులూలేవు. రేపు గతేట్లా? గడిచేదెట్లా? నేను

బతికుండి ఇదంతాచూస్తూ ఏడ్వడం అంతా నాకర్మ. (అంటూ లోపలికి వెళ్లిపోతుంది.)

(వెంకన్న యింట్లోకి పోబోతుంటే, వాకిట్లోంచి గోపీచంద్ చేతిలో సంచి, బెడ్డింగులతో ప్రవేశం.)

గోపీ:- వెంకన్నా, ఈ సామాను ఇంట్లో పెట్టు. నాన్నా! ఏమిటి ఆలోచిస్తూ కూర్చున్నావ్? (వెంకన్న సామాను తీసుకుని లోనికి వెళతాడు)

రామ:- ఏం లేదురా, ఇదేనా పట్నంనుంచి రావడం? ఇంత ఆలశ్యమయిందేం బండిరావడం?

గోపీ:- మనవూరికి బండిసరిగ్గా వచ్చిందెప్పుడూ? అబ్బ! ఏంజనం ఏంజనం, థర్డుక్లాసులో కిక్కిరిసిపోయారు జనం. రాత్రిళ్ళు నిద్రలులేవు, పగలయితే నుంచునే ప్రయాణం. ఫుట్‌బోర్డులమీద, టాపులమీద మనుష్యులు ప్రయాణంచేస్తూంటే, బండి సరిగ్గా టైముకెలా వస్తుంది? బళ్ళవాళ్ళందరూ సమ్మెకట్టారటగా! ఒక్క బండన్నా లేదు. స్టేషన్నుంచి నడిచే వచ్చా. వాసున్నాడా? వాడిమీద వారంటుకూడా ఉందటగా! ఎక్కడ తిరుగుతున్నాడో?

రామ:- ఆసంగతి కేంగాని, ఏమిటి మీకాన్ఫరెన్సు విశేషాలు?

గోపి:- ఏమిటేమిటి? సోషలిస్టుపార్టీ యికనుండి మాస్ పార్టీ అయిపోయింది. ఇంతవరకూ మితంగావున్న సభ్యత్వం విస్తరించబడింది. అంతేకాదు, ప్రజాస్వామ్యంలో విశ్వాసమున్న ప్రతివ్యక్తికీ మా పార్టీలో స్థానముందినాన్నా!

రామ:- ఏమిటీ! సోషలిస్టుపార్టీ సభ్యత్వం విస్తరించారా?

మళ్లీ యింకో కాంగ్రెసు మోస్తరు చేశారన్నమాట... అంతేగా ఎవర్నిపడితే వార్ని చేర్చుకోవటంలో అర్థం?

గోపి:- అదికాదు నాన్నా! ఇండియాలో సోషలిజం రావాలంటే కొద్దిమంది కార్మికవీరులతో రాదు. ప్రజానీకం కోరినపుడే ఆపని జరుగుతుంది. అందుకని ప్రజలందర్ని ఆహ్వానించి వారి విశ్వాసంతో ఇండియాకు సోషలిజం తేవాలి. నాన్నా యింతవరకు మీ అడుగుజాడల్లో దేశవిప్లవాన్ని, కాంగ్రెస్ లోవుండినడిపాం, త్యాగాలుచేశాం, కాంగ్రెస్ అనేకవీరోచిత సంఘటనలతో పోరాటంజరిపింది. మేము మాబాధ్యత తీర్చుకున్నాం, స్వరాజ్యం వచ్చింది. కాని యింకా సురాజ్యంరాలేదు నాన్నా! సమాజంలో పరివర్తనం రావాలి. కాంగ్రెస్ స్వతంత్రం తెచ్చింది. ఇక సోషలిస్టుపార్టీ భారత దేశ గౌరవప్రతిష్ఠలను నిలబెడుతుంది. సోషలిస్టు రిపబ్లిక్ చేసి ప్రపంచానికి శాంతిసందేశమిస్తుంది. నాన్నా! గాంధీజీ చెప్పింది యిదేగా?

రామ:- గోపీ చూస్తున్నావుగా యీ కమ్యూనిస్టుల కుయత్నాలు...రక్తపాతంలో దొమ్మిదోపిడీలతో ప్రజానీకాన్ని భయపెట్టి అధికారంకోసం పడే తాపత్రయం వింటున్నావుగా? ప్రజలలో ప్రస్తుతంఉండే సస్పృహను, కాంగ్రెస్ అంటే ఏర్పడుతున్న అసహ్యతను అనువుగా చూచుకొని పార్టీ ప్రాబల్యంకోసం హింస ప్రేరేపిస్తున్నారు. చూస్తున్నావుగా?

గోపి:- మొన్న పాట్నా కాన్ఫరెన్సులో యీ విషయంకూడా వచ్చిందినాన్నా! కాంగ్రెస్‌లోని లోపాలను మా పార్టీ

విజయంగా మేమెన్నడూ అనుకోము. కాంగ్రెస్‌సంస్థ అస్థి కలపై, కాంగ్రెస్‌సంస్థ మృతకళేబరంపై సోషలిస్టుఇండియా ఎన్నటికి ఉద్భవించదునాన్నా...నాకీ రాచకీయాలు, నాకీ సమాజంలో స్థానం, కాంగ్రెస్ నేర్పింది, కాంగ్రెస్ నన్నా జ్ఞాపించింది. నా దేహంలోని ప్రతిఅంగమూ, ప్రతిఅణువూ కాంగ్రెస్ అధ్వర్యంలో తయారయిందినాన్నా, కాని చూస్తున్నావుగా నాన్నా! కాంగ్రెస్ పేరుతో జరుగుతూ ఉన్న అత్యాచారాలు...అరవై ఏళ్లనాటి కాంగ్రెస్ చరి త్రితో పోలిస్తే ఈనాడు కాంగ్రెస్ ఎక్కడుందినాన్నా... ఏం నాన్నా మాట్లాడవు?

రామ:- ఏం మాట్లాడమంటావు గోపీ! కాంగ్రెస్‌లో యింకా ఆ కొందరు మహాపురుషులయినా ఉండబట్టి యీరోజున ఆమాత్రమయినా వుంది. రేపు కాంగ్రెస్ ఏమవుతుందో నాకేం తోచటంలేదు. అబ్బ! మళ్లా గుండెనొప్పి వచ్చింది. (అని బాధపడుతాడు.)

గోపి:- అబ్బ! మళ్లీవచ్చిందానొప్పి? జైల్లోవచ్చిన నొప్పేకదూ? ఉద్రేకంగా మాట్లాడి నీకు నొప్పి కల్గించానా నాన్నా?

రామ:- అదికాదురా! సీరియస్‌గా ఆలోచించినా, తీవ్రంగా మాట్లాడినా మధ్యమధ్య యిట్లాగే వస్తూవుంటుంది. కాస్త ఊరుకుంటే అదే తగ్గుతుంది.

(ఇంతలో మారువేషంతో వాసు ప్రవేశం.)

గోపి:- (చూచి) ఎవరు? ఒరే నువ్వటా! ఏమిటీ దొంగ వేషాలు?

వాసు:- మా వేషాలకేంలే, మళ్ళీ పప్పులో కాలువేసిందకే మీ సోషలిస్టుపార్టీ. ఇదివరకటి విప్లవాత్మకమయిన పార్టీ కాస్తా పార్లమెంటరీ కాన్స్టిట్యూషనల్ పార్టీ అయిందటగా! ఇంకా ఎక్కడుందోయ్ మీ విప్లవపంథా, మీపురోగమనపంథా! ఆ! మరచిపోయా, యిక ఎవరినిపడితే వారిని చేర్చుకుంటారటగా! ఇంకావేం? ఎత్తులువేసే క్యాపిటలిస్టులంతా యిక మీపార్టీలో చేరుతారు. సేట్ దాల్మియా, టాటా, బిర్లా మీ పార్టీలోనే మకాం. దాంతో యిది కూడా ఒకబూర్జువా! కాపిటలిస్టులలో.

గోపి:- తప్పు తప్పు...సోషలిస్టుపార్టీని ఎన్నడూ క్యాపిటలిస్టు పార్టీ కానియ్యం...సోషలిస్టుపార్టీ ఎప్పుడు కష్టించేవారి పార్టీయే. కష్టించే కార్మికులకోసం, దున్ని పూడ్చే కర్షకులకోసం మాపార్టీ పనిచేస్తుంది సోదరా! అందుకనే యిప్పుడుకూడా ఎఫీలియేటెడ్ మెంబర్షిప్ వుంది. దాంతో కార్మికసంస్థలు, రైతుసంస్థలు మా పార్టీలో వుంటాయి. వారే కార్యక్రమాన్ని, పాలసీని నిర్ణయించేవారు...తెల్సిందా?

వాసు:- ఈ చాదస్తం యేమిటోయ్! బూర్జువాలను నశా చేయాల్సిందే! ఈ ధనికవర్గాన్ని దోచుకోవాల్సిందే. అందుకనే మా కమ్యూనిస్టులు ఒక పారెలెల్ గవర్నమెంటును స్థాపించి ఇంకొక సైనాను తయారుచేస్తున్నారిక్కడ.... ముందుముందు నీకే తెలుస్తుంది బ్రదర్! (అంటూ లోపలికి పోతాడు.)

గోపి:- నాన్నా! వింటున్నావుగా వాసుగాడి వాలకం! నల్లగొండజిల్లాలో, నానా బీభత్సం కల్పిస్తున్నారు. హత్యలు, దోపిడీలు...వాళ్ల వ్యతిరేకులందరిని చంపడం, తుపాకి చూపించి గ్రామాలలో ప్రజలను, "కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్" అనిపిస్తున్నారట. దేశంలో ఎన్ని సమస్యలు మూల్గుతున్నాయి.......వీళ్లదొక పెద్దసమస్య అయింది నాన్నా! గవర్నమెంటు ఎంతడబ్బు ఖర్చుపెడుతోంది, ఎంత మిలిటరీవీళ్లకోసంవినియోగించబడుతున్నది, ఎంతమందిఅమాయకప్రజలు హింసింపబడుతున్నారు, విన్నావా? దీన్ని చైనా చేస్తారట! ఇదివరలో వీళ్ళు రష్యా చేస్తారనేవాళ్ళు జ్ఞాపకంవుందా? ఇప్పుడు దాన్నిమార్చి చైనా అంటున్నారు. మాటనిలకడలేని మహానుభావులు, ప్రజాస్వామ్యంలో విశ్వాసముంటే ధైర్యంగా ప్రభుత్వాన్ని పౌరహక్కులతో ఆక్రమించకూడదూ? ఈ దొంగదోపిళ్ళేమిటి? పౌరసత్వంలోను, ప్రజాస్వామ్యంలోను నమ్మకమే లేనివారికి ఆ హక్కులకోసం పోరాడుతున్నా మనడం హాస్యాస్పదం కాదునాన్నా!

(ఇంతలో మహమ్మదల్లీ ప్రవేశం)

రామ:- రా మహమ్మదల్లీ! కూర్చో! ఏమిటి వ్యవహారం? ఏమంటున్నారు మీవాళ్ళు?

మహ:-ఏముందిసార్!ఆఖాశింరజ్వీగాడిమీద ముఖద్దమా చలాయించుతారట, తగినశాస్తి చేయాలిసార్ వాడికి! ఎన్ని హత్యలు చేశాడుసార్, దీనికంతకూ కారణం, ఆ నవాబేట సాబ్, గోపీచందుగార్కి తెలుసుబాబూ!

గోపి:- అసలు మన దేశంలో నవాబులు రాజులే వుండకూడదు. అందులో ప్రజల్ని యింతకష్టపెట్టిన నైజామును గద్దె నుండి దింపాల్సిందే. అంతేకాదు నాన్నా! మా పార్టీవాళ్లు రజ్వీని విచారించేటప్పుడే, నవాబుగార్ని కూడ కోర్టుకు తెచ్చి విచారించమని కోరుతున్నారు నాన్నా!

గంగా:- (ప్రవేశించి) ఏమిటి నైజాము నవాబుగారి సంగతేనా, మన హిందూ దేశానికి ఆయనొక ఏన్నాళ్ళశని. ఏం మహమ్మదల్లీ! (మహమ్మదల్లీతో చేతులుకలుపుతూ) అచ్ఛాహై! యింకా నవాబేమిటి? నవాబు...రాజులు తరాజులౌతున్నారు. ఇంకా నిజాంకు నీళ్లెక్కడ? పీకి పారెయ్యాల్సిందే!

మహ:-హాఁ సాబ్! జరూర్ జరగాల్సిందే సాబ్!

గంగా:- ఆ, నిజంగా నువ్వుకూడ......

మహ:- నాకేమన్నా సమజ్ లేదా సాబ్! మొదట జిన్నా... తరువాత ఖాసింరజ్వీ, ఈ నైజాం మా తురకలకందరికీ ముప్పు తెచ్చారు.

గోపి:- నాన్నా! నీ సహవాసంలో గంగాధరం, మహమ్మదల్లీలు యిద్దరు పూర్తిగా మారిపోయారే? వీళ్ళిద్దరిని పూర్తిగా మార్చేశావ్! ఎంతమార్పు! ఎంతమార్పు!

రామ:- అదికాదురా! గంగాధరం తనంతటతానే ఆర్. ఎస్. ఎస్. కు రాజీనామా యిచ్చాడు. మహమ్మదల్లీకి ఆనాటి దెబ్బలతో మతావేశం మాడిపోయింది.

గోపి:- అదేమిటోయ్, గంగాధరం!

మహ:- అదికాదు గోపీచందుగారూ! అసలుసంగతేమిటంటే, గాంధీగారినిచంపిందఆర్.ఎస్.ఎస్.వాళ్ళేగా!దాంతోటి మన

గంగాధరంగారికి మనసు చెలించిపోయింది. అంతకుమునుపు వీళ్ళు, మాజాతివాళ్ళని సఫాచేయాలన్నారు. గాంధీజీ చావుతో వీళ్ళందరూ చలించిపోయారు.

గంగా:- ఆర్. ఎస్. ఎస్. కు రాజీనామా పెట్టానోయ్! కాంగ్రెస్‌లో చేరదామనుకుంటున్నా!

గోపి:- సరే ఆర్. ఎస్. ఎస్. వాడివి నువ్వు కాంగ్రెస్‌లో చేరదామనుకుంటున్నావు? బాగుంది! నువ్వేమిటోయ్ అలీ?

మహ:—నేనాసార్! నామట్టుకైతే నేను కాంగ్రెస్‌లో చేరుతా సార్! కాని మావాళ్లంతా కమ్యూనిస్టుల్లో చేరదామంటున్నారు. నే ఎన్నోసార్లుచెప్పానాబ్! దాంట్లోచేరితే మక్కెలిరగతంతారని!

గంగా:- కమ్యూనిష్టుల్లోనా? బాగుంది! ఇక బాగుపడ్డట్టె!

గోపి:- ఈ ముస్లిములసలు పాకిస్థానను బలపరచి మొదటితప్పు చేశారు. అజాద్ హైదరాబాద్ కావాలని రెండోతప్పు... ఇప్పుడు కమ్యూనిష్టుల్లో చేరితే, వారిభవిష్యత్తు వారికే తెలియాలి.

గంగా:- ఈ కమ్యూనిస్టులా, నల్లగొండలో వీళ్ళుచేసే దుర్మార్గాలా, హైదరాబాద్‌నంతా ఆక్రమిస్తారటగా?

గోపి: అంతాబాష్! దాంట్లో నూటికి 90 పాళ్లు ప్రాపగాండా. ఎట్లాగైనా ఇండియా గవర్నమెంటు హైదరాబాద్‌లో వుండాలంటే యిదోకసాకు. అంతేగాని మిలిటరీ గవర్నమెంటుంటే యింకా యీ గొడవేమిటి? ఇద్దరు తెందనాలాడి తల బద్దలుకొట్టుకుంటే కమ్యూనిస్టులగొడవ, ఒక ఆడదానికోసం యిద్దరు తన్నుకుంటే కమ్యూనిస్టుగొడవ. ఒక

కేమిటి? ప్రస్తుతం మన దేశంలోని కల్లోలానికి ముఖ్యకారకులు, ఈ కమ్యూనిస్టులేగా! ఈ రోజుల్లో కమ్యూనిస్టులంటే అసహ్యం బయలుదేరుతోంది. అంతేకాదు......
మామూలు సమ్మెలు పేరుబడ్డ సోషలిస్టులు చేయించినా అదీ కమ్యూనిస్టుసంబంధమే అంటుంది మన గవర్నమెంటు.

రామ:- మరీ చోద్యంరా, అలా ఎన్నడైనా అందా?

గోపి:- మొన్న రైల్వేస్ట్రయిక్ అవలేదుకాని...సమయానికి ప్రభుత్వం కలుగచేసుకోపోయి ఆ సమ్మెజరిగితే ఏమయ్యేది? అనవసరంగా జయప్రకాశ్ బదనామ్ అయ్యేవాడుకాదూ?

గంగ:- జయప్రకాశా! ఆర్. ఎస్. ఎస్. ను మా జోరుగా ఖండిస్తాడండీ! ఇహ కమ్యూనిస్టులైనే తేలెక్కలేదు. వాళ్ళు దేశద్రోహులన్నాడు. విదేశపురష్యా ఏజంట్లన్నాడు, మార్క్సు మార్క్సు అనిచెప్తూ మార్క్సు సిద్ధాంతాలనే మంట కలుపుతున్నారన్నాడు. ఒకటేమిటి? ప్రస్తుతం మన దేశంలోని కల్లోలానికి ముఖ్యకారకులు కమ్యూనిస్టులే నంటాడు.

మహమ్మ:- దాసూజీ! మీకిది తెలుసా? హైదరాబాద్ ఇండియాలో చేరాలి అంటే, "అబ్బెబ్బె అట్లాచేయకూడదు అజాద్ హైదరాబాద్ను కాపిటలిస్టు కాంగ్రెస్ గవర్నమెంటుచేతుల్లో పెట్టకూడ" దన్నారు.

గంగా:- క్యాపిటలిస్టులంటే జ్ఞాపకమొచ్చింది! హైదరాబాద్ యూనియన్లో కలిస్తే, మీవాను చెప్తాడే డిట్లా పార్టీ వాళ్లకి లాభంట...సామాన్యులకేమీ లాభంలేదుట.

గోపి:- మావాను డిబ్టాపార్టీ ఏమిటీ! ఈ కొత్త పార్టీ కమ్యూని
స్టువాళ్ళ సంబంధమూ లేకపోతే వాళ్ళకి వ్యతి రేకమా?

గంగా:- అదేనోయ్! డిబ్టాపార్టీ అంటే డి-అంటే డాల్మియా, ఐ-అంటే ఇస్పహాని, బి-అంటే బిర్లా, టి-అంటే తాతా, ఎ-అంటే అదేదో చెప్పాడండి!

గోపి:- అలగప్పచెట్టియారా?

గంగా.- ఆ, ఆయనే! మద్రాసుమనిషి.

రామ:- మాబాగాకుదిరింది! వీళ్ళంతాకలిసి ఒకపార్టీకావచ్చు.

గోపి:- ఇపుడా పార్టీమాటేమో దేశంలో చెలామణీ, వాళ్ళ బిజినెస్ కంపెనీలన్నీ మన నాయకులపేర్లమీద చెలామణీ, ఇంకేంకావాలి?

గంగా:- అవునండోయ్! జ్ఞాపకంవచ్చింది. ఈమధ్య ఎవడో చెప్తున్నాడూ, "నేతాజీ హోటల్లోతిని, ఆజాద్‌బీడీకాల్చి, గాంధీ హైర్ కటింగ్ సెలూన్‌లో క్రాపుచేసుకుని, కస్తూరిబా హైర్ఆయిల్ రాసుకని, నెహూ్రు లాండ్రీలోని డ్రెస్ వేసుకుని, రాజాజీ టాకీసుకువెళ్ళి, పట్టాభి, పటేళ్ళ గార్ల ఫిక్చరు చూసినవాడికి మోక్షం చాలా దగ్గరగా వుంటుందట"......(అంతా నవ్వుతారు.)

మహ్మ:- అయితేసాబ్! నల్లగొండలో కాంగ్రెసువాళ్లని చంపుతున్నారటగా?

గోపి:- వాళ్ళకి వ్యతిరేకు లుండకూడదులే! ఈపార్టీ ప్రభుత్వం లోకివస్తే దేశంలో నిరంకుశత్వం తాండవించాల్సిందే! కత్తివున్నవాడిదే రాజ్యమవుతుంది. నాన్నా! నీవు మొన్న మీటింగులో కమ్యూనిస్టులను ఖండిస్తూ, ఈ జిల్లాలో

వాళ్ళఆటలు సాగనీయం అని ఛాలెంజి చేశావనగానే కమ్యూనిస్టులకు నీమీద పట్టరానిపగ ..వాళ్ళకీ తెలుసు నిజంగా నీవు బ్రతికుండగా ఈ జిల్లాలో నీళ్లుపుట్టవని.

(ఇంతలో కామ్రేడ్ వాసు లోపల్నించి దుస్తులుమార్చుకొని ప్రవేశం)

వాసు:- చర్చలు మాజోరుగాసాగుతున్నాయి. నాన్నా ఢంకా మీద దెబ్బకొట్టి చెబుతున్నా, ఏనాటికైనా కూలీలకు కడుపునిండా కూడుపెట్టేది మేమే. మా అస్త్రానికి తిరుగులే దెప్పుడూ! కూలీల శ్రేయస్సు మా పార్టీ శ్రేయస్సే...... మార్క్సు ఏమన్నాడు?

గోపి:- ఆ, ఆ, తెలుస్తూనేవుంది మీ అస్త్రప్రయోగం... మొన్న రైల్వే స్ట్రయికులోనే తేలింది మీ వ్యవహారం! గవర్నమెంటు రైల్వేవాళ్ళు కోరిన కోర్కెలన్నీ తీరుస్తా మని హామీయిచ్చినా, "విడిచినఅస్త్రం ఉపసంహరించం" అంటూ పట్టినపట్టు విడవకుండా సమ్మె జరిగితీరాల్సిం దన్నారు. ఆ సమ్మెగనక జరిగితే ప్రజలెంత దెబ్బతినేవాళ్లు? రైల్వేకూలీలు ప్రజలదృష్టిలో ఎంతహీను లయ్యేవాళ్ళో తెలిసేది. కామ్రేడ్, సమ్మె కడపటిఆయుధం. మాటిమా టికి సమ్మెచేస్తే సమ్మెలో విలువేముంది? పార్టీ బలం కోసం అఘోరించే మీ పంథాకూడా ఒక పంథాయేనా బ్రదర్?

రంగా:- బాగాచెప్పేరు గోపీచందుగారూ! జయప్రకాశ్ పార్టీ ఎటువంటిదైనా సమయానికి రక్షించాడుకాబట్టి సరి

పోయింది. లేకపోతే దేశమంతా ధ్వంసం అయిపోయేది. ఈ కమ్యూనిస్టుల్నా... మీవాడు కాబట్టి ఊరుకున్నా లేకపోతే ఒక్కక్షణములో డిపోర్టుచేస్తినా, అబ్బాయిపనౌతుంది.

వాసు:- మిస్టర్, ఒళ్ళు దగ్గిరపెట్టుకోని వాగు? ఏం స్క్రూ లూజ్ అయిందా? ఫిట్ చేయిస్తాం. కామ్రేడ్ వాసు నీనెత్తురు కళ్ళచూస్తాడు, ఏమనుకున్నావో?

గోపి:- గంగాధరంగారూ! మాతమ్ముడయితేనేం, దేశానికి ద్రోహంచేసే ప్రతివ్యక్తినీ బహిష్కరించాల్సిందే! మనింటిలోకలరాఫుట్టితే మనకలరావగా అనివార్యకుంటే మన్నంటుకోకుండా వుంటుందా?

రామ:- గోపీ! ఆవిషయం అంతటితో పోనీయండి. మీరంతా పెద్దవాళ్ళయ్యారు. ఎవరికి ఎవరు చెప్పేరోజులిప్పుడు? చాల పొద్దుపోయింది. గంగాధరం! పోయివస్తావా? మహమ్మదల్లీ! రేపురండి మాట్లాడుకుందాం... వెంకన్నా! వెళ్ళి రోడ్డుదాకా లాంతరు చూపించిరా!

(వెంకన్న లాంతరు తీసుకుంటాడు.)

గంగా:- మంచిది, యిక శెలవా?

మహ:- గంగాధరంజీ నేనూ వస్తున్నా పదండి. సలాందాసూజీ! గోపీచంద్ బాబూ! పోయివస్తా.

రామ, గోపి:- మంచిది.

(వెంకన్న, గంగాధరం, మహమ్మదల్లీ వెళ్ళిపోతారు.)

(సీతమ్మ చెంబునీళ్లతో లోపలనుంచి ప్రవేశించి బల్లమీాద పెడుతూ)

సీత:-అయినాయా బాబూచర్చలు? ఇవ్వాళమా అదృష్టం మంచిది. తండ్రీకొడుకులు తొందరగా తేల్చారు.

రామ:- తేల్చక ఏముంది? ఆహా! నీ చిన్నకొడుకు బాగా తయారయ్యాడు... ఇంటికొచ్చిన పెద్దమనుష్యులతో పోట్లాడు కుంటూ. వీడి వయస్సెంతో...గంగాధరంనెత్తురుచూస్తాట్ట! బయలుదేరాడు మహావీరుడు.

సీత:- అబ్బ ఊరుకుందురూ, ఎప్పుడూ ఉన్నగొడవలేగా మనింట్లో? యివ్వాళ కొత్తేమీాలేదుగా! వాసూ! పోయి పడుకో. నీమీాద వారంటుకూడా ఉందికదూ? ఆలోచనైనా లేకుండా పరాయివాళ్లతో పోట్లాడితే వాళ్ళేంచేస్తారో తెలుసా? (వాసు వెళ్లిపోవును.)

గోపి:- నాన్నా! పోయి పడుకుంటా, అమ్మా! పెందలాడే లేపు. 7 గంటలబండికి వూరెళ్ళాలి.

సీత:- అల్లాగే, పోయిపడుకో...(గోపి వెళ్లుతాడు.)

(రామదాసు చదువుతూ వుంటాడు.)

సీత:- అబ్బ చదువు చాలింతురూ! పదిగంటలయింది.

రామ:- (లేస్తూ) పడుకోటానికేమిలేవే! చూశావా? మన యింటికాపురం.. ఒకపక్క దేశంచూస్తే ఆతీరుగావుంది. కల్లోలం, భీభత్సం....మనింట్లోచూస్తే చిన్నవాడు మాట వినేటట్లులేడు...మనకడుపున చెడవుట్టేడువీడు. గృహంలో కల్లోలం లేవతీశేటట్లున్నాడు. గృహకల్లోలం...ప్రపంచ

మంతా కల్లోలం...ద్వితీయ మహాప్రపంచ సంగ్రామంతో ఆరంభమయిన కల్లోలం...ఇంతవరకూ చల్లారలేదుకదా! శాంతి, సత్యం, ధర్మం, అని చెప్పే గాంధీజీని బలిచేసుకున్నాం. ఎన్నటికో యీ కల్లోల వాతావరణ అంతర్ధానం...ఎప్పటికో యీ సంక్షోభ పరిస్థితి కాలాంతం... (ఆగి) ఈ మానవ మహా ప్రస్థానంలో ఎన్ని కోట్లజీవులు మరణిస్తున్నాయి, తిరిగి ఉద్భవిస్తున్నాయి! మానవజీవితమే ఒక మహాకల్లోలం......కల్లోలనాటకం. ఈ నాటకంలో స్త్రీపురుషు లిద్దర్ని పాత్రధారులుచేసి, పరమాత్ముడు నాటకం ఆడిస్తున్నాడు, సూత్రధారణ చేస్తున్నాడు (ఆగి) అబ్బ! దేశంలో ఎంత అసంతృప్తి, ఎంత నిర్లిప్తత, ఎంత ఉద్రేకం, ఎంత అసహనం, పెచ్చుపెరిగిపోయింది! రామరాజ్యం రానే రాదేమో! ఎప్పుడు మాకు విముక్తి? దుర్భరం! దుస్సహం!...సర్వేశ్వరా! ఈ జీవితాన్ని ఒక కడకు చేర్చు...నీదే భారం.

(అంటూ శయ్యచేరి నిద్రపోతాడు.)

(సీతమ్మ దుప్పటి పూర్తిగా కప్పి దీపంతగ్గించి వెళ్ళిపోతుంది. కొంతసేపటికి ముఖం ముసుగుతో ఒకవ్యక్తి ప్రవేశం. నెమ్మదిగా అడుగులేసుకుంటూ కలయచూచి, రామదాసు శయ్యచేరి, నిద్రపోతున్నట్లుగా గ్రహించి అతనిని హత్య చేస్తాడు. రామదాసు, "ఆ, అబ్బ!" అంటూ పడిపోయి ప్రాణాలు విడుస్తాడు. ఆ కేకకు, హడావిడిగా వాసు టార్చిలైటుతో ప్రక్కగదిలోనుంచి ప్రవేశం. పారిపోతున్న వ్యక్తిని

పట్టుకొని టార్చితో చూస్తూ "ఆ, నీవా! కామ్రేడ్, మా నాన్న నే!" అంటాడు.)

కామ్రేడ్:- హుష్, హుష్ వాసూ! మెల్లగామాట్లాడు. మీ నాన్న బ్రతికుంటే ఈ జిల్లాలో మనపార్టీ వృద్ధికివస్తుందా? ఇది రివల్యూషనరీ పార్టీపంథాకాదూ! దీనికి పెద్ద ప్లాను వేశాంలే! ఇవ్వాళ రామదాసు, రేపు గోపీచంద్.

వాసు:- ఆ, గోపీచందును కూడానా?

కామ్రేడ్:- ఆ, పురుగు లుండకూడదు. నాశనంచెయ్యాల్సిందే! కమ్యూనిస్టుపార్టీ పాలసీ! ఎఱ్ఱజండా రక్తపాతంలో మునిగి తేలాలి.

వాసు:- (అంతా వింటూ, మెల్లగా వింటున్నట్లు నటిస్తూ, తండ్రినిచంపిన బాకుతోనే హఠాత్తుగా కామ్రేడ్‌ను పొడుస్తాడు.)

కామ్రేడ్:- ఆ, నన్నే! కమ్యూనిస్టునైయుండి నన్నే!

(అంటూ నేల కూలుతాడు.)

వాసు:- కామ్రేడ్! నీ ప్రాణంతీపి తెల్సిందా? (కాలితో తన్నుచు) చావు, దుర్మార్గుడా! ఛీ! (తండ్రిదగ్గరకుపోయి) నాన్నా! నన్ను క్షమించు. నీమాటలువినక చెడిపోయాను. నేనూ నిన్ను కలుసుకుంటాను... ఈ పాపిష్టి దుర్మార్గుల పార్టీలోచేరి సిగ్గెన్నో తిట్టాను. నాకిదే శిక్ష (అంటూ పొడుచుకో పోతుండగా హఠాత్తుగా గోపీచంద్ ప్రవేశించి)

గోపి:- ఆ, వాసూ! ఏమిటిది? (ఆగి) తెలిసింది! తెలిసింది... ఇదా నీవుచేసింది! ద్రోహీ! కన్నతండ్రిని చంపావా! నాన్ననిచంపి మీ పార్టీని బలపరుస్తున్నావా? నాన్న నీకేం ద్రోహంచేశాడు...ఛీ! దుర్మార్గుడా! నీవు మనిషివి కావా? సిగ్గులేదూ? (అంటూ కత్తి లాక్కుంటాడు.) నాన్నా! నాన్నా!

వాసు:- అన్నా! అవును. ద్రోహినే! నా బాకు నాకీయి... అదుగో! ఒకద్రోహి అక్కడ పడియున్నాడు ..ఇంకో ద్రోహినికూడా యీ లోకంనుంచి పంపిస్తా......ఇప్పటి కయినా ప్రజలు గుర్తిస్తారు.

గోపి:- దుర్మార్గుడా! బాకు నీకిస్తానా? నీముఖం చూడకూడదు పో...

(సీతమ్మ ఇంట్లోంచి, వాకిట్లోంచి వెంకన్న ప్రవేశిస్తారు. సీతమ్మ రామదాసునుచూచి పైనిపడి ఏడుస్తుంది.)

వాసు:- అన్నా! నన్ను క్షమించు, నాన్నను చంపింది నేను కాదు...ఆ ద్రోహి......ఛండాలుడు! చంపి పోతుంటే వాణ్ణి చంపేశాను.

గోపి:- ఛీ! ఇంకా అబద్ధాలాడుతున్నావా? ప్రాణాలు తీయటం ఎంత తేలిక నీకు! నిన్ను నమ్మేదెవరు? ఛీ! అమ్మా! చూశావా నీ చిన్నకొడుకు?

సీత:- అయ్యో, వాసూ! నీకేం పోయేకాల మొచ్చిందిరా! ధర్మరాజువంటి మనిషిని (ఏడుస్తుంది.)

వాసు:- అమ్మా! నీతోడు. నేనెరగను, వాడే చంపాడు.

గోపి:- ఛీ! నీకు సిగ్గులేదు.

వాసు:- (కాళ్ళపై బడుతూ) అన్నా! నామాట నమ్మ.

గోపి:- నిన్ను నమ్మేదెవరు? వెంకన్నా! ఆ పోలీసుల్నిలా పిలు. ద్రోహుల్ని శిక్షించాల్సిందే!

వాసు:- అన్నా...అమ్మా...అన్నా!

గోపి:- (ఏమీ మాట్లాడడు. కోపంతో నిలబడి వుండగా తటాలున తెరపడుతుంది.)

(తెరలోనుండి పాట వినిపిస్తుంది.)

ఎవరుచేసినకర్మ వారనుభవింపక ఏరికైనను తప్పదన్నా
తాడిచెట్టుక్రింద పాలుతాగుతనంటె నమ్మేదిఎవరురా యన్నా నిన్ను॥
చేయికాలినవెనుక ఆకట్టుకుంటేను చెయిమంటతగ్గునా యన్నా నీదు॥
మరచి లక్ష్యంకోరి చెడుపనులు చేస్తూంటె మంచెట్లువచ్చురా యన్నా
నీకు॥





| | |
|---|---|
| | **మనసు ఫౌండేషన్**<br>**పుస్తకాల పరిశీలనాపట్టిక** |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA105B109 |
| పుస్తకం పేరు | కల్లోలం |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | progathi |
| పేజీలు విడదీసినది | progathi |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |